# పంచ్‌లు... పంచెలు...!

**ఫిల్మ్ నగర్**





ప్రస్తుతం తెలుగు సినిమాల్లో 'పంచ్'లు, 'పంచె'ల టైమ్ నడుస్తోంది. తెర మీద దుస్తులు నలగకుండా, మేకప్ చెరగకుండా, గ్లామర్‌గా కనిపించాలనుకునే హీరోలు (కేవలం హీరోయిన్లే కాదు) బలమైన కారణముంటేగానీ పంచెకట్టు వైపు తొంగిచూడరు. తెలుగు సినిమా కథలు గ్రామాలను వదిలి నగరాలకు వలస వచ్చిన తర్వాత 'పంచె'లు తెరమరుగయ్యాయి. ఎప్పుడో ఒకసారి హీరో బ్రాహ్మణుడి పాత్ర వేస్తేనో, లేదంటే పండగలు, ఫంక్షన్ల పాటల్లోనో పంచెకట్టులో తళుక్కున మెరిసి ఆ తర్వాత వాటిని విప్పి మూలన పడేసేవారు.

కాలంతో పాటు క్యారెక్టరైజేషన్‌లో మార్పు వస్తోంది. క్యారెక్టర్‌కు తగ్గట్టుగా పంచెకట్టులో కనిపించేందుకు మన హీరోలు ఉత్సాహం చూపుతున్నారు. నవతరం ఇప్పుడు పాత సంప్రదాయాలను 'ఫ్యాషన్'గా చూస్తోంది. అందుకే యువహీరోలు పంచెలు, లుంగీలతో డిఫరెంట్‌గా కనిపిస్తున్నారు. ఇటీవల వచ్చిన సినిమాలను గమనిస్తే పంచెకట్టు అనే ట్రెండ్ ఒకట్రెండు సీన్లకే పరిమితం కాకుండా సినిమా మొత్తం కనిపిస్తోంది. తాజాగా దర్శకుడు తేజ 'నేనే రాజు నేనే మంత్రి'లో రానా దగ్గుబాటితో పంచె కట్టించారు.

అంతకుముందు 'కాటమరాయుడు'లో పవన్‌కళ్యాణ్ పంచెకట్టులో డిఫరెంట్‌గా కనిపించారు. ఈ మధ్య అల్లుఅర్జున్ కూడా 'దువ్వాడ జగన్నాథమ్'లో బ్రాహ్మణ యువకుడిగా పంచెకట్టుతోనే పంచ్ డైలాగులు పేల్చారు. నాగార్జున (సోగ్గాడే చిన్నినాయనా) వంటి సీనియర్ హీరోలతో పాటు నాగచైతన్య, శర్వానంద్ వంటి యువహీరోలు కూడా రెగ్యులర్ జీన్స్ వదిలేసి పంచెకట్టును పాపులర్ చేస్తున్నారు. వారి క్యాస్ట్యూమ్స్ లిస్టులో పంచెలు, లుంగీలు కూడా చేరడంతో అభిమానులు ఆ స్టయిల్స్‌ను ఫాలో అవుతున్నారట. ❇





# INSIDE






**'ట్రై లక్' బ్యాచ్!**

ఎక్కడెక్కడి నుంచో వచ్చిన పక్షులు చెట్టుమీద వాలినట్టు... ఆ సినిమా స్రాష్టికులంతా 'ట్రై లక్ కేఫ్'కు చేరుకున్నారు. 'ట్రై లక్ బ్యాచ్'గా పేరు తెచ్చుకొన్నారు. 7



**సాయిచంద్**

'అంకురం' తర్వాత 25 ఏళ్ల పాటు నటనకు దూరంగా ఉన్న సాయిచంద్ 'ఫిదా'లో కనిపించారు. అభ్యుదయ భావాలు గల రైతుగా, ఇద్దరమ్మాయిలకు తండ్రిగా మెప్పించారు. 12

మీ అభిప్రాయాలను పోస్టు ద్వారా **ఆదివారం ఆంధ్రజ్యోతి**, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33కు, మెయిల్ ద్వారా sunday.aj@gmail.comకు పంపండి.












## ప్రియమైన 'ఆంధ్రజ్యోతి'కి...

### ◆ 'న్యూరో మైండ్' సెట్

'మైండ్ గేమ్... న్యూరో మార్కెటింగ్' కథనం ఆసక్తికరంగా సాగింది. వినియోగదారుడి ఆలోచనల్లోకి వెళ్లి, అతడి అవసరాలనూ, అభిరుచులనూ గ్రహించి, అందుకు తగినట్టుగా వస్తువును రూపొందించాలనే ఆలోచన చాలా బాగుంది. కానీ వినియోగదారుడి బలహీనతను పట్టుకుని, క్యాష్ చేసుకోవాలనుకోవడం మంచిది కాదు. ఎందుకంటే ఆ విషయాన్ని అతను గ్రహించిన మరుక్షణం ప్రత్యామ్నాయ మార్గం వెతుక్కుంటాడు లేదా బలహీనతను అధిగమిస్తాడు. బ్రాండ్ ఇమేజ్ సంపాదించుకోవడం ఎంత కష్టమో, దాన్ని స్థిరంగా కాపాడుకోవడం అంతకు మించిన కష్టం. ఎన్నో బడా కంపెనీలు నష్టాల ఊబిలో ఇరుక్కున్న సంగతి తెలిసిందే!

– **ప్రేమ్‌దాస్**, జనగామ

### ◆ కథా కౌన్సెలింగ్

'ఒక భార్య - ఒక భర్త' చిన్న కథే అయినా అందరికీ అర్థమయ్యే విధంగా ఉంది. మనసులు ఏం కోరుకుంటాయో చాలా చక్కగా వివరించారు రచయిత. ఉన్నత చదువులు చదువుకున్న భార్యాభర్తల మధ్య చెలరేగే 'ఇగో' సమస్యలను ఏ విధంగా పరిష్కరించుకోవాలో కౌన్సెలింగ్ ద్వారా వివరించడం బాగుంది. కొత్తగా పెళ్లైనవారు, పెళ్లి చేసుకోబోయే వారు తప్పక చదవాల్సిన కథ ఇది.

– **పెండికట్ల పి.ఆర్**, అమలాపురం
**డా. కె.ఎల్.వి. ప్రసాద్**, హన్మకొండ

### ◆ నైవేద్యం నోరూరే!

ఈ వారం 'దైవమ్' శీర్షికలో ప్రచురించిన 'కార్యశూరుడు... గరుత్మంతుడు!' కథనం బాగుంది. చాలామందికి విష్ణుమూర్తి వాహనంగానే పరిచయమైన గరుత్మంతుడి జన్మ వృత్తాంతం గురించీ, ఆయన మాతృభక్తి గురించీ తెలుసుకున్నాం. 'శ్రావణ నైవేద్యాలు' నోరూరించాయి.

– **ఎల్. ప్రఫుల్ల చంద్ర**, ధర్మవరం

### ◆ మస్త్ మున్నార్

'ట్రావెలోకం'లో మున్నార్ యాత్రావిశేషాలు ఆకట్టుకున్నాయి. తెలుగువారికి అతి చేరువలో ఉన్న ఈ సుందర ప్రదేశం గురించి చదువుతుంటే, అక్షరాలతోనే ఆ అందాలను వీక్షించిన అనుభూతి కలిగింది. హీరోయిన్ మెహ్రీన్ కౌర్ పదేళ్లకే ర్యాంపు వాక్ చేసిందని చదివి ఆశ్చర్యపోయాం.

– **పద్మనాభం**, పరిగి

### ◆ బుల్లితెర స్టార్

'కొంచెం టచ్‌లో ఉంటే చెబుతా'నంటూ కొంటెగా కవ్వించినా, 'గడసరి అత్త, సొగసరి కోడళ్ల' మధ్య చిలిపి వైరాలు పెట్టే ఆటలాడించినా... మాటలతో 'ఢీ' కొట్టి, నవ్వుల పూలు పూయించినా అది యాంకర్ ప్రదీప్‌కే చెల్లింది. యూత్‌లో క్రేజ్‌ను పెంచుకుంటూ బుల్లితెర స్టార్‌గా ఎదుగుతున్న అతనికి ఆల్ ది బెస్ట్.

– **అంజుమా**, కరీంనగర్

# 'నేమ్'కరణోత్సవం!

ట్రంప్‌కు దీపాల చుట్టూ తిరగడమంటే భలే ఇష్టం. హాయిగా దేశాధ్యక్షుడి హోదాలో ప్రపంచాన్ని చుట్టిరాకుండా, ఇదేం అలవాటూ... అంటారా? మోదీ చుట్టూ సువాసనలే. అయితే, ప్రధాని ఖరీదైన అత్తరేదో వాడుతూ ఉండాలి... అనుకుంటున్నారా? ఏంజెలీనా జోలీ దెబ్బకి పురుగూపుట్రా రాలిపోవాల్సిందే. ఆమెకు హిట్సే కాదు, 'హిట్' కొట్టడమూ అలవాటా... అన్న సందేహం కలుగుతోందా? కాదు కాదు. ట్రంప్ ఓ పురుగుపేరు. మోదీ ఓ పుష్పం పేరు. ఇలా మనుషుల పేర్లు పెట్టుకున్న వృక్ష, జీవ జాతులు అనేకం.

## ప్రిన్స్ 'ఫ్రాగ్' చార్లెస్!



బ్రిటన్ యువరాజు చార్లెస్... మహారాణి ఎలిజబెత్ కొడుకు. అతని పేరును ఓ కప్పకు పెట్టారు. అంతరించి పోయిందనుకున్న మండూక జాతి అడవిలో ప్రత్యక్షమవ్వడంతో దానిని కాపాడుకునే ప్రయత్నాలు చేస్తున్నారు శాస్త్రవేత్తలు. ఈక్వెడార్ అటవీ ప్రాంతంలో దీన్ని కనుగొన్నారు. అడవులను కాపాడేందుకు చార్లెస్ చేసిన కృషికి గానూ ఈ గౌరవం దక్కింది. ఆ కప్ప పేరు హైలోసిర్టస్ ప్రిన్స్ చార్లెసీ. రెండు కప్పలను మ్యూజియంలో సంరక్షిస్తూ సంతతిని పెంచడానికి ప్రయత్నిస్తున్నారు పరిశోధకులు.



## డోనాల్డ్ 'చిమ్మట' ట్రంప్!

రాత్రి పూట వాన పడి ఆగిందంటే చాలు... చిమ్మట పురుగులు గుంపుగా తరలివస్తాయి. లైటు చుట్టూ తిరుగుతూ గోలగోల చేస్తాయి. ఆ జాతికి చెందిన కొత్త చిమ్మట పురుగును ఈ ఏడాది మొదట్లో కనుక్కున్నారు. దాని ముఖం ట్రంప్ జుట్టు రంగులో ఉంటుంది. ట్రంప్ ఎప్పుడూ విరుచుకుపడే మెక్సికో, కాలిఫోర్నియా, బజా ప్రాంతాల్లో ఇవి జీవిస్తాయి. వాటికి 'నియోపోల్పి డోనాల్డ్ ట్రంప్' అని పేరు పెట్టారు శాస్త్రవేత్తలు. పైగా, అధ్యక్షుడి గౌరవార్థం ఆ పేరు ఖరారు చేసినట్టు ప్రకటించారు. దేశాధ్యక్షుడి పేరు పెట్టడం వల్ల చిమ్మట గురించి ఎక్కువమందికి తెలిసే అవకాశం ఉంటుందని వారి అభిప్రాయం.







## ఏంజెలీనా 'సాలీడు' జోలీ!



సాలెపురుగును చూస్తేనే చాలా మందికి భయం. అలాంటిది ప్రపంచం మెచ్చిన అందాల భామ పేరు ఓ సాలీడుకి పెట్టారు. ఏంజెలీనా జోలీ కుర్రకారు కలల రాణి. ఆమె మానవతావాది కూడా. ఐక్యరాజ్యసమితిలో శరణార్థుల సమితికి హైకమిషనర్‌గానూ పనిచేశారు. ఆ సమయంలో వేలాదిమంది శరణార్థుల్లో ఆత్మస్థైర్యాన్ని నింపారు. అందుకుగానూ, ఆమె గౌరవార్థం ఓ అరుదైన జాతి సాలె పురుగుకి జోలీ పేరును జత చేశారు. ఆ సాలీడు పూర్తి పేరు 'ఆప్టోస్టిచెస్ ఏంజెలీనా జోలీ'. ఇది విషపు సాలీడు. ఎదుటి జీవిలోకి విషాన్ని చిమ్మి చంపేస్తుంది.

నెదర్లాండ్స్‌లో పూచే అరుదైన, ఓ తులిప్ జాతి పూలకి ఐశ్వర్యరాయ్ పేరు పెట్టారు. అలాగే సింగపూర్‌లో ప్రత్యేకంగా వృద్ధి చేసిన ఆర్కిడ్స్‌కి షారుక్ ఖాన్ పేరు పెట్టారు.

## నరేంద్ర 'పుష్ప' మోదీ!



ఈ ఏడాది మోడీ తొలిసారిగా ఇజ్రాయెల్ పర్యటనకు వెళ్లారు. ఆ సందర్భంగా ఓ అరుదైన జాతి పూలకు మోదీ పేరు పెట్టి గౌరవించింది ఆ దేశ ప్రభుత్వం. జెరూసలేంలోని ఓ పూల ఫామ్‌లో ఈ కొత్తరకం పుష్పాన్ని సృష్టించారు. మిగతా పూలతో పోలిస్తే... ఇవి అతి త్వరగా పూస్తాయి. 70 ఏళ్ల తరువాత ఓ భారత ప్రధాని దేశంలో అడుగుపెడుతుండడంతో ఆ అరుదైన జాతి పూలతోనే స్వాగతం పలికారు. ఆ పూలు రంగురంగుల్లో చాలా ముచ్చటగా ఉంటాయి. వీటి అసలు పేరు క్రిసంతమెన్... కానీ మోదీ ఫ్లవర్స్ అనే పిలుస్తున్నారక్కడ. అలా పిలవమని ఇజ్రాయెల్ ప్రభుత్వం ప్రజలను కోరింది.

## బరాక్ 'ఫిష్' ఒబామా!

అమెరికన్ ప్రజలకు బరాక్ ఒబామా అంటే అభిమానం. అందుకే ఓ చేపకు అతడి పేరు పెట్టుకున్నారు అక్కడి పరిశోధకులు. హవాయి దీవులలోని సముద్రంలో ఒక కొత్త రకం చేపను కనుగొన్నారు. అవి అక్కడ తప్ప ఇంకెక్కడా బతకలేవు. సముద్రానికి 90 కిలోమీటర్ల అడుగున జీవిస్తాయి. వాటికి 'టోసానాయిడెస్ ఒబామా' అన్న పేరు ఖాయం చేశారు. ఇవి ఆరు సెంటీమీటర్ల పొడవు పెరుగుతాయి.





## లియోనార్డో 'కీటక' డావిన్సీ

ప్రపంచం మెచ్చిన చిత్రకారుడు లియోనార్డో డావిన్సీ. అప్పటి ఇటలీ ప్రాంతంలో పుట్టాడు డావిన్సీ. ఆయన వేసిన మోనాలిసా చిత్రంలోని చిరునవ్వు ఇప్పటికీ ఓ మిస్టరీనే. ఆ ప్రఖ్యాత చిత్రకారుడి పేరు ఓ కీటకానికి పెట్టడం విచిత్రం. సూడాన్‌లో కనుగొన్న ఆ కీటకం పేరు లియోనార్డో డావిన్సీ మోత్. ఆ కీటకానికీ, డావిన్సీకీ ఎలాంటి సంబంధమూ లేదు. కేవలం అతడి గౌరవార్థం కొత్త జీవికి ఆ పేరును ఖరారు చేశారు.



**కనిపించని...**

# ఐదో దిక్కేరా పోలీస్!

**తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణ... నాలుగు దిక్కులు! నల్లగొండ జిల్లా ప్రజలకు మాత్రం కనిపించని ఐదో దిక్కూ ఒకటుంది. అదే పోలీస్! కష్టాలొచ్చినా, కన్నీళ్లొచ్చినా 'మీరే దిక్కంటూ' ఆ దిక్కుకే వెళ్తారు. జిల్లా ఎస్పీ న్యాలకొండ ప్రకాష్‌రెడ్డి చొరవే ఇదంతా.**



పోలీస్ అంటే లాఠీ ఝుళిపించడమే అన్న ఆలోచన తప్పని నిరూపిస్తున్నారు నల్లగొండ జిల్లా పోలీసులు. ప్రజా పోలీసింగ్ కోసం 'జనమైత్రి' కార్యక్రమం అంటూ ఒకటున్నా, చాలాకాలం క్రితమే అది మొక్కుబడిగా మారిపోయింది. నల్లగొండ ఎస్పీ న్యాలకొండ ప్రకాష్‌రెడ్డి ఆ 'జనమైత్రి'కి జవసత్వాలిచ్చి, మళ్లీ జనం మధ్యకు తీసుకొచ్చారు. ప్రపంచంలోనే అత్యధిక ఫ్లోరైడ్ ఉన్న ప్రాంతం మునుగోడు మండలం. సాధారణంగా తాగునీటిలో 1.4 పీపీఎం ఫ్లోరైడ్ ఉండాల్సి ఉండగా, మునుగోడు ప్రాంతంలో అది 14 శాతం మేరకు ఉంది. ఈ ప్రాంతంపై ఎస్పీ దృష్టిపెట్టారు. పద్దెనిమిది గ్రామాల్లో రక్షిత మంచినీటిని అందించేందుకు ఆర్వో ప్లాంట్లు ఏర్పాటు చేయించారు. స్థానికంగా ఉన్న ఫార్మా కంపెనీల్ని ఆ కార్యక్రమంలో భాగస్వాముల్ని చేశారు. తీవ్రంగా ఇబ్బంది పడుతున్న పది హేను మందిని గుర్తించి పౌష్టికాహారం కోసం నెలకు వెయ్యి రూపాయల చొప్పున ఆర్థిక సాయం అందించే ఏర్పాటు చేశారు. నేరెళ్ళ గ్రామానికి చెందిన సైదులు అనే యువకుడికి హైదరాబాద్‌లోని కేర్ ఆస్పత్రిలో సుమారు రూ.2లక్షలతో సర్జరీ చేయించారు. ప్రస్తుతం సైదులు సాధారణ జీవితం గడుపుతున్నాడు.

**ఆడబిడ్డలకు 'రక్షిత'...**

దేవరకొండ ప్రాంతంలో గిరిజన జనాభా ఎక్కువ. నిరక్షరాస్యత, పేదరికం ఇక్కడి సమస్యలు. ఇంట్లో మగ సంతానం ఉండితీరా లన్నది గిరిజనుల ఆచారం. అందుకోసమే... ఏకంగా ఎనిమిది పదిమంది బిడ్డల్ని కన్నవారూ ఉన్నారు. మూడునాలుగు పెళ్లిళ్లు చేసుకున్న దాఖలాలూ అనేకం. ఆడశిశువు పుట్టిందంటే వదిలించుకునేందుకే ప్రయత్నిస్తుంటారు. ఇతరులకు అమ్మేయడం, ఐసీడీఎస్ కేంద్రాల్లో వదిలేయడం, చెత్తకుప్పల్లో పారేయడం, చంపేసి అనారోగ్యంతో చనిపోయిందని చెప్పడం... ఆ అజ్ఞానం, అమాయకత్వం ఎంతకైనా తెగించేలా చేస్తోంది. సమస్య తన దృష్టికి రాగానే ఎస్పీ కదిలిపో యారు. రెవెన్యూ, విద్యా, వైద్య, స్త్రీ శిశు సంక్షేమ శాఖల నుంచి ఒక్కో అధికారిని తీసుకొని, ఓ మహిళా పోలీస్ అధికారి నాయకత్వంలో 'రక్షిత' పేరిట బాధిత మండలాల్లో బృందాలను ఏర్పాటు చేశారు. ఏ మహిళ అయినా గర్భం దాల్చిన విషయం తెలి యగానే... 'రక్షిత' రంగంలోకి దిగుతుంది. నెల నెలా ఆరోగ్యాన్ని పర్యవేక్షించడం, వివిధ శాఖల నుంచి అందాల్సిన ప్రయోజనాలను మంజూరు చేయించడం, ప్రసవానికి ఏర్పాట్లు చేయడం, ఆ తర్వాత ప్రతినెలా శిశువు బాగోగుల్ని తెలు సుకోవడం, తల్లిదండ్రుల కదలికల మీద నిఘాపెట్టడం... ఇవన్నీ రక్షిత బాధ్యతలే.

**దత్తత పల్లెలు...**

ప్రజలపై తమ శాఖ ముద్ర ఉండాలన్న ధ్యేయంతో ఎస్పీ ప్రకాష్‌రెడ్డి కొన్ని గ్రామాలను దత్తత తీసుకున్నారు. నల్లగొండ జిల్లా కేంద్రానికి కూతవేటు దూరంలో ఉన్న గుండ్లపల్లి అటు కరువుతో, ఇటు ఫ్లోరైడ్‌తో అల్లాడుతోంది. గ్రామం మీదుగా ఎలిమినేటి మాధవరెడ్డి ఎత్తిపోతల పథకం కాల్వ వెళ్తున్నా ఉపయోగం లేని పరిస్థితి. నల్లగొండ పట్టణానికి తాగునీరు అందించేందుకు ఏర్పాటు చేసిన ఈ కాల్వలో ఏడాదిలో రెండు లేదా మూడుసార్లు సాగర్ నుంచి నీటిని వదులుతారు. 15 రోజుల పాటు ఈ వరద కొనసాగుతోంది. అయితే గుండ్లపల్లి మీదుగా కాల్వ వెళ్ళే క్రమంలో నీటి ప్రవాహం ఒత్తిడికి కాలువ దెబ్బతినకుండా కొన్ని ప్రాంతాల్లో కట్టకు ఇరువైపులా చిన్నపాటి రంధ్రాలు చేశారు. ఆ రంధ్రాల గుండా నీరు వృథాగా పోతోంది. ఆ నీటిని నిల్వ చేసుకునే విషయాన్ని గ్రామస్తులు ఎస్పీ దృష్టికి తీసుకువెళ్లారు. వెంటనే ఎస్పీ రంగంలోకి దిగా రు. సాగునీటి శాఖ అధికారులతో అంచనా వేయించగా రూ.50లక్షలకు పైగా వ్యయం అవుతుందని తేల్చారు. ఎస్పీ మరింత లోతుగా ఆలోచించి, గ్రామంలోని చెరువును నింపడంతోపాటు 200 ఎకరాలకు సాగునీరు అందించేలా వినూత్నమైన ప్రణాళిక సిద్ధం చేశారు. రెడ్డీస్ ల్యాబరేటరీ సహకారంతో రూ.18 లక్షలకే ప్రాజెక్టును పూర్తి చేశారు. చెరువు నిండాక పరిసర ప్రాంతాల్లో భూగర్భ జలాలు పెరిగాయి. బోర్లలోంచి నీళ్లు పెల్లుబు కుతున్నాయి. గ్రామంలో ఐదు రూపాయలకే 20 లీటర్ల నీటిని సరఫరా చేసే ఆర్వో ప్లాంట్‌ను కూడా ఏర్పాటు చేశారు పోలీసులు. స్థానికంగా గ్రంథాలయాన్ని తిరిగి తెరిపించారు. నల్లగొండ మండలంలోని నర్సింగ్‌భట్లలో గ్రామంలో సైతం ఇదే తరహాలో కార్యక్రమాలు చేపట్టారు.

'పోలీసులు ప్రజల్లో భాగమే. ప్రజలకు సేవలందించేందుకే పోలీసులు ఉన్నారన్న వాస్తవాన్ని అర్థమయ్యేట్టు చెప్పాలంటే ప్రజలతో మమేకం అవడమే ఏకైక మార్గం. జిల్లా కలెక్టర్ గారి ప్రోత్సాహమూ మరువలేని ది' అంటారు ఎస్పీ ప్రకాష్‌రెడ్డి. నాలుగో సింహం కాస్తా ఐదో దిక్కు అయినప్పుడు... పల్లెల్లో వచ్చే సానుకూలమైన మార్పులకు నల్లగొండ పోలీసులే నిలువెత్తు ఉదాహరణ.

**- మారబోయిన మధుసూదన్**

ఆంధ్రజ్యోతి, నల్లగొండ

ఫొటోలు : ముచ్చర్ల విజయ్





# అస్తమానం పుస్తకాలతోనే కుస్తీ!






**మేడమ్... నా కూతురు 9వ తరగతి చదువుతోంది. బాగా తెలివైనది కానీ పుస్తకాల పురుగు. ఎప్పుడు చూసినా పుస్తకాలతోనే కుస్తీపడుతుంది. స్నేహితులనేవారే లేరు. అదేమిటంటే... స్నేహితులతో టైమ్ వేస్ట్ అంటుంది. ఎలాంటి యాక్టివిటీస్‌లో కూడా పాల్గొనదు. ఆమె మైండ్‌సెట్ మార్చాలంటే ఏం చేయాలి?**

**- ప్రీతి, వారాసిగూడ, సికింద్రాబాద్**

సాధారణంగా తల్లిదండ్రులు బిజీగా ఉంటే, పిల్లలను 'చదువు... చదువు...' అంటూ బలవంతపెడతారు. చదువుకుంటేనే గోల్స్ సాధించవచ్చని నూరిపోస్తారు. దాంతో పిల్లలు పుస్తకాలతో కుస్తీ పట్టడం నేర్చుకుంటారు. కొన్నాళ్లకు అదే అలవాటుగా మారుతుంది. అయితే ఎప్పుడైనా సరే ఐక్యూ (ఇంటిలిజెన్స్ కోషెంట్) సక్సెస్ అనేది 30 శాతం ఉంటే, ఈక్యూ (ఎమోషనల్ కోషెంట్) కాంబినేషన్ (ఇది 70 శాతం ఉంటుంది) కూడా జతకూడినప్పుడే సంపూర్ణ విజయం లభిస్తుంది. మొదటిది చదువు వల్ల వస్తే, రెండోది ఇతరులతో కలిసిమెలిసి ఉన్నప్పుడు, మనలోని భావోద్వేగాలను అర్థం చేసుకోవడం ద్వారా వస్తుంది. పిల్లలకు ఈ విషయం తెలియకపోతే పేరెంట్స్ అర్థమయ్యేలా చెప్పాలి. చదువుకోవడం పూర్తవ్వగానే వారిని పదిమందితో కలిసి ఉండేలా ప్రోత్సహించాలి. చాయిస్ ఇవ్వకుండా కొన్ని కార్యక్రమాల్లో బిజీగా ఉండేలా చేస్తే, మిగతాది వారే నేర్చుకుంటారు. ఈక్యూ లేకుండా ఐక్యూ మాత్రమే ఉంటే భవిష్యత్తులో సమస్యలు తలెత్తుతాయి.

**19 ఏళ్ల మా అబ్బాయి విరాట్‌కోహ్లీకి వీరాభిమాని. వాడి గది నిండా కోహ్లీ పోస్టర్లే అతికించుకున్నాడు. అతడి స్టయిల్‌నే అనుకరిస్తుంటాడు. పరీక్షల్లో మంచి మార్కులు రాకున్నా ఫీలవ్వడు కానీ మ్యాచ్‌లో కోహ్లీ సరిగా ఆడకపోతే మాత్రం తెగ ఫీలై నిరాశచెందుతాడు. మరీ అంత పిచ్చి ఉంటే కష్టమని నేను తరచూ హెచ్చరిస్తూనే ఉంటాను. కానీ వాడు నా మాటలు అస్సలు లెక్కచేయట్లేదు. వాడికి ఈ పిచ్చి పోవాలంటే ఏం చేయాలి?**

**- స్నేహ, హైదరాబాద్**

పిల్లలు క్రికెట్‌స్టార్స్‌ను, సినిమాస్టార్స్‌ను అభిమానించడం సర్వసాధారణమే. అయితే సెలబ్రిటీల స్టయిల్స్‌ను గుడ్డిగా అనుకరించడమే కాకుండా, వారు సక్సెస్ కావడానికి పడ్డ కష్టాన్ని, శ్రమను కూడా అర్థం చేసుకోవాలి. విరాట్‌కోహ్లీ టీమ్‌లోకి రావడానికి ఎంతగా శ్రమించాడో మీరే అబ్బాయికి వివరించాలి. అలా కష్టపడితేగానీ కోహ్లీకి ఆ స్టార్‌డమ్ రాలేదనే విషయాన్ని తెలపాలి. టీనేజ్ పిల్లలకు రోల్‌మోడల్స్ ఉంటే మంచిదే కానీ, వారిని ఇన్సిపిరేషన్‌గా తీసుకున్నప్పుడే మన జీవితం కూడా బాగుంటుందని చెప్పాలి. విరాట్ కోహ్లీ స్టార్ క్రికెటర్‌గా మారడానికి, అంతమంది అభిమానులను సంపాదించుకోవడానికిగల కారణాలను, అతడి శ్రమ, కృషిని పదే పదే అబ్బాయికి చెబితే... కేవలం కోహ్లీ అంటే పిచ్చి కాకుండా, అదే కోహ్లీ ఇన్సిపిరేషన్‌గా మారుతాడు.



**మేడమ్... మా అబ్బాయి 8వ తరగతి చదువుతున్నాడు. వాడి ఆలోచనలు చకచకా మారుతుంటాయి. ఉదాహరణకు ఒక సినిమా హీరోను చూడగానే నేను కూడా హీరోనవుతా అంటాడు. పోలీస్ ఆఫీసర్‌ను చూడగానే పోలీసునవుతా అంటాడు. ప్రతీ విషయంలో ఇదే తంతు. దీనివల్ల వాడి భవిష్యత్తు ఏమవుతుందోననే ఆందోళన ఎక్కువవుతోంది. పరిష్కారమార్గం చెప్పండి?**

**- పద్మజ, విజయవాడ**

8వ తరగతి అంటే సుమారుగా 13 ఏళ్లుంటాడు కాబట్టి మీరు పెద్దగా ఆందోళన చెందాల్సిన పనిలేదు. ఆ వయసులో పిల్లలు ఎవరు నచ్చితే వాళ్లలాగా తయారవుతానంటారు. అయితే పేరెంట్‌గా మీరు చేయాల్సింది ఏమిటంటే అబ్బాయి చెబుతున్నవి విని, సమగ్రంగా ఆ ఫీల్డు గురించి చర్చించడమే. ఇంకో రెండేళ్లలో అబ్బాయి మెచ్యూరిటీ లెవల్స్ పెరుగుతాయి కాబట్టి అన్ని విషయాల్లో స్పష్టత వస్తుంది. స్నేహితులతో కాలేజీకి వెళ్లినప్పుడు కూడా భవిష్యత్తులో ఏం చేయాలనేదానిపై ఒక అవగాహనకొస్తాడు. ఎటుతిరిగి అతడు చెప్పేదానికి మీరు ఫిక్స్ అయితే కష్టం. 'ఇంతకుముందు ఇన్‌స్పెక్టర్ అన్నావు, ఇప్పుడు యాక్టర్ అంటున్నావు' అంటూ ఒత్తిడి తేవొద్దు. ఎప్పుడైనా పిల్లలను స్వేచ్ఛగా వదిలేయాలి. పేరెంట్స్ కేవలం గైడ్ చేయాలి.



**సుజాతా రాజమణి**
కన్సల్టెంట్ సైకోథెరపిస్ట్,
కిమ్స్ హాస్పిటల్

మీ పిల్లల ప్రవర్తనకు సంబంధించి ఏమైనా ప్రశ్నలుంటే మాకు పోస్ట్‌లో గానీ, మెయిల్‌లో గాని పంపవచ్చు.
**అడ్రస్ :** ఆదివారం ఆంధ్రజ్యోతి, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33, **మెయిల్ ఐడి :** sunday.aj@gmail.com

కవర్ స్టోరీ

FRIEND

# 'ట్రై లక్' బ్యాచ్!

**స్నేహం చుట్టూ తిరిగే సినిమాలు చాలా ఉన్నాయి. ఇది మాత్రం, ఆ సినిమా కథలకు రూపమిచ్చే... దర్శకులూ, రచయితలూ, సంగీత దర్శకుల స్నేహం కథ. ఓ ఇరానీ కేఫ్ బ్యాక్‌డ్రాప్‌లో 'వేడివేడి ఛాయ్‌లా...' మొదలవుతుంది. క్లైమాక్స్‌లో వెచ్చని ఆలింగనాల మధ్య 'శుభం' కార్డు పడుతుంది. మధ్యలో బోల్డన్ని సెంటిమెంట్లూ, కమర్షియల్ ఎలిమెంట్లూ. టైటిల్... ట్రై లక్ బ్యాచ్! (నేడు ఫ్రెండ్‌షిప్ డే)**

ఇరవై నుంచి పాతికేళ్ల క్రితం.

హైదరాబాద్.

సోమాజిగూడ.

రాజ్‌భవన్‌రోడ్.

శాంతిశిఖర అపార్ట్‌మెంట్ ఎదురుగా ఉన్న ఇరానీ కేఫ్. పేరు... ట్రై లక్.

ఛాయ్ చెత్తగా ఉండేది.

అయినా సరే... అరగంటకోసారి 'తీన్ మే చార్..' ఆర్డరిచ్చేదా మిత్రబృందం. కేఫ్ వాడికి కోపం రాకుండా అదో ఏర్పాటు!

సమోసాలు చద్దివాసన కొట్టేవి.

వాటినే... పోటీపడి తినేదా బ్యాచ్. చాలా మందికి అవే బ్రేక్‌ఫాస్ట్, లంచ్, స్నాక్స్... అన్నీ!

ఉస్మానియా బిస్కెట్లు ఉసూరుమనిపించేవి.

అదో సమస్యే కాదన్నట్టు... ప్లేట్లకు ప్లేట్లు ఖాళీ చేసేదా గ్యాంగ్. సాయంత్రం దాకా కాలం గడవాలిగా!

టేబులు మీద సిగరెట్ ప్యాకెట్టూ అగ్గిపెట్టే సిద్ధం. కాల్చాలనుకున్నవాళ్లు కాల్చుకోవచ్చు. వద్దనుకున్నవాళ్లు డబ్బాలు ఖాళీ అయ్యేదాకా ఎదురుచూసి, వాటి మీద స్టోరీ ఐడియాలు రాసుకోవచ్చు.

బిల్లు విషయానికొస్తే, ఎవరి జేబులో డబ్బుంటే వాళ్లు ఇచ్చేవారు. ఎవరి దగ్గరా లేక పోతే, ఇచ్చేవాడు వచ్చేదాకా ఎదురుచూసే వారు. ఎవరో ఒకరు చచ్చినట్టు వస్తారన్న గట్టి నమ్మకం.

చర్చలన్నీ సినిమా చుట్టే. అందులోనూ స్పెషలైజేషన్లు. ఒకరు హాలీవుడ్ ఎన్సైక్లోపిడియా. ఒకరు బాలీవుడ్ బాద్షా. ఒకరు తెలుగిండస్ట్రీ తురుమ్‌ఖాన్. మళ్లీ అందులో... సూపర్ సీనియర్, సీనియర్, జూనియర్ - ఇలా రకరకాలు.

పాతోడిది అనుభవం.

కొత్తోడిది ఆవేశం.

'ఓ బ్రేక్ కావాలి భయ్యా...' కొత్త కుర్రాడు పూనకం వచ్చినట్టు ఊగిపోయేవాడు. అంతలోనే, కాళ్లకింద ఏదో బ్రేకైపోతున్న చప్పుడు. తీరా చూస్తే, ప్యాంటు చివర్లని కొరికేస్తూ ఎలుకపిల్ల. 'ట్రైలక్'లో పుట్టిపెరిగిన అనేకానేక చిట్టెలుకల్లో ఇదో పొట్టెలుక!

కెవ్వున అరిచేవాడు జూనియర్.

ఫక్కున నవ్వేవాళ్లు సీనియర్స్.

'కన్ఫర్మ్. ఎలకచెబితే చిలక చెప్పినట్టే. ఈరోజు నుంచీ నువ్వు ట్రైలక్ బ్యాచ్‌లో ఫుల్ టైమ్ మెంబర్వి. తెల్లవారుజామున ఐదున్నర నుంచీ రాత్రి హోటలు కట్టేసేదాకా ఎప్పుడైనా రావచ్చు. ఎంతసేపైనా కూర్చోవచ్చు. ఎక్కడ ఆడిషన్స్ జరుగుతాయో, ఎవరు కొత్త మొహాల కోసం వెతుకుతున్నారో, ఏ ఆడిటోరియంలో ఏ సినిమా ఫంక్షన్ జరుగుతోందో... ఒకటేంటి, ఇండస్ట్రీకి సంబంధించిన సమస్త సమాచారమూ నీకు లభిస్తుంది. ఛాన్సు రాగానే పొంగిపోవద్దు. అవకాశం రాకపోయినా కుంగిపోవద్దు. నువ్వేదో పెద్ద తోపనీ తొక్కనీ భ్రమలేం పెట్టుకోవద్దు. ట్రైలక్‌లో ఎలుకలే ఉన్నాయ్. ఇండస్ట్రీలో తిమింగలాలూ ఉంటాయ్. జాగ్రత్త. ఆల్ ది బెస్ట్' ...ఆ బ్యాచీకి గురుస్వామిలాంటి వాడొకడు బ్రహ్మాండమైన ఫిల్మోపదేశం చేసేవాడు. ఆ పరంపరలో ఓ గురూజీ పేరు చంద్రసిద్ధార్థ. సభ్యుల జాబితా మాత్రం కాస్త పెద్దదే.

• • •

ఆ పాతిక ఇరవైమందిలో...

ఒక్కొక్కరిది ఒక్కో కథ, ఒక్కో కల.

సినిమాల్లోని గ్లామర్ గోపీమోహన్‌ను మురళీగానంలా కట్టిపడేసింది. రైలెక్కి హైదరాబాద్ వచ్చేశాడు. ట్రైలక్ పరిసరాల్లో వీరూ పోట్ల (డైరెక్టర్), సుధాకర్ ఎక్కంటి (కెమెరామేన్)లతో కలిసి అద్దెగది తీసుకున్నాడు. అవకాశాల కోసం కాళ్లరిగేలా తిరిగేవాడు. ఏదో ఒకరోజు పరుచూరి బ్రదర్స్ నుంచి పిలుపొస్తుందనీ, ఎవరో ఒకరిదగ్గర అసిస్టెంట్‌గా కుదిర్చేస్తారనీ ఆశగా చెప్పుకునేవాడు. 'శివ'తో సినిమా రూల్స్‌ని బ్రేక్ చేసిన వర్మ అంటే మహా అడ్మిరేషన్.

మాటల మాంత్రికుడిగా, విజయాల దర్శకుడిగా త్రివిక్రమించకముందు త్రివిక్రమ్ శ్రీనివాస్... ఓ మామూలు శ్రీనివాసే, మహా అయితే శీను. ట్రైలక్ దగ్గర ఓ బ్యాచిలర్ రూమ్‌లో ఉండేవాడు. ఆర్పీ పట్నాయక్, సునీల్ అతడి రూమ్మేట్స్. త్రివిక్రమ్ ఎప్పుడూ మితభాషే. పుస్తకాలతోనే కాలక్షేపం. ఏదో రాసుకుంటూ కూర్చునేవాడు. ఖర్చుల కోసం ట్యూషన్లు చెప్పుకునేవాడు. అందులోనే కొంత ఇంటికి పంపేవాడు. ఇక, ఆర్పీ ప్రపంచం ఆర్పీది. రెండుసార్లు ప్రిలిమ్స్ తన్నేశాక.. ఐఏఎస్ కలని అటకెక్కించి సినిమాల






## ఇదీ... ట్రైలక్ బ్యాచ్!

- చంద్రసిద్ధార్థ, దర్శకుడు
- ఆర్పీ పట్నాయక్ (సంగీత దర్శకుడు, నటుడు, దర్శకుడు)
- త్రివిక్రమ్ శ్రీనివాస్ (రచయిత, దర్శకుడు)
- సునీల్ (హాస్యనటుడు, హీరో)
- గోపీమోహన్ (కథ, స్క్రీన్ ప్లే రచయిత)
- దశరథ్ (దర్శకుడు)
- వీరు పోట్ల (దర్శకుడు)
- శీను వైట్ల (దర్శకుడు)
- జయకృష్ణ గుమ్మడి (కెమెరామేన్)
- హరి (రచయిత, దర్శకుడు)
- సాయికృష్ణ (రచయిత)
- వి.వి.గిరిధర్ (ఆర్టిస్ట్)
- సందేశ్ (ఆర్టిస్ట్)
- బాలా రాజశేఖరుని (డీన్, అన్నపూర్ణ ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్)
- చైతన్యప్రసాద్ (గేయ రచయిత)
- మద్దినేని రమేశ్ ('బ్రోకర్-2' డైరెక్టర్, కార్యదర్శి, దర్శకుల సంఘం)
- దంతులూరి చైతన్య ('బాణం' ఫేమ్ )
- వేణు (హీరో)
- అనంత ప్రభు (నటుడు)
- లక్ష్మణ్ ఏలే (పోస్టర్ డిజైనర్)
- ఉదయ్ నందనవనం (డైరెక్టర్ 'శంకరాభరణం')
- రేవన్ యాదు (దర్శకుడు - బూచమ్మ బూచోడు, హౌరా బ్రిడ్జి)
- సర్వేశ్ మురారి (కెమెరామేన్)
- ఆర్.కె. ('హైదరాబాద్ నవాబ్స్' ఫేమ్)
- శ్రీవాస్ (దర్శకుడు)
- కూచిపూడి వెంకట్ (దర్శకుడు, ఉలవచారు బిర్యాని హోటల్స్ ఫేమ్)
- వీరభద్రం చౌదరి (దర్శకుడు... 'అహనా పెళ్లంట', 'పూల రంగడు')
- పూరి జగన్నాథ్ (దర్శకుడు)
- సుధాకర్ ఎక్కంటి ('సైరాత్' కెమెరామేన్)

ఇంకా... తదితరులు, తదితరులు.

మీద పడ్డాడు. ఏ ఒక్క ఇన్‌స్ట్రుమెంటూ వాయించడం రాకపోయినా, కాన్ఫిడెంట్‌గా సంగీత దర్శకత్వం మీద గురిపెట్టాడు. సునీల్‌ది 'లైట్ తీస్కో...' ఫిలాసఫీ. ఆ పూటకి కడుపులో నాలుగు బిర్యానీ మెతుకులు పడితే చాలనుకునేరకం. ఏదో ఒకరోజు అదృష్టదేవత అప్పులవాడిలా తనని వెతుక్కుంటూ వచ్చేస్తుందన్న ఓ పిచ్చి నమ్మకం. డాబా మీద చాప పరుచుకుని ముగ్గురు మిత్రులూ మ్యూజిక్ సిట్టింగ్ వేసేవారు. శ్రీనివాస్ ఆశువుగా పాటలు రాసేస్తుంటే, ఆర్పీ అంతే వేగంగా ట్యూన్లు కట్టేవాడు. ఇద్దరి మధ్యా... జడ్జిపాత్రలో సునీల్. నచ్చితే 'అబ్బా, ఏం ఉందిరా!' అనేవాడు. నచ్చపోతే 'ఏం బాలేదురా' అని తేల్చేసేవాడు. ట్రైలక్‌లో కూర్చున్నప్పుడే కావచ్చు, 'మీ ముగ్గురూ మహర్జాతకులే దొరా..' అని ఓ చిలకజోస్యం వాడు బల్లగుద్ది చెప్పెళ్లాడు. ఎవరూ నమ్మలేదు. ఒకరైతే ఫర్వాలేదు, ఇద్దరైనా ఏమో అనుకోవచ్చు. ముగురికీ సక్సెస్ రావడానికి ఇదేమైనా సినిమానా? అన్న అనుమానం. జీవితమూ కొన్నిసార్లు ఫిల్మీగానే ఉంటుందని తెలియడానికి ఎంతో సమయం పట్టలేదు. కర్ణాటకలో ఇంజినీరింగ్ చేసొచ్చిన వేణు లక్ష్యం కూడా సినిమాలే. పంజాగుట్టలోని ఓ రేకుల గదిలో కాపురమంటూ, హీరో కావాలని కలలు కనేవాడు.

చంద్రసిద్ధార్థ ఇల్లు ట్రైలక్ వెనకాలే. వాళ్లింట్లో కాఫీ టీల అలవాటు లేదు. దీంతో, ఎవరొచ్చినా గొంతు తడపడానికి ఇక్కడికే తీసుకొచ్చేవాడు. మెల్లగా అంతా ఫ్రెండ్స్ అయిపోయారు. అందరికీ గురువైపోయాడు. ఆ శిష్యుల్లోనూ ప్రియశిష్యుడు రేవన్ యాదు. తనదో స్టోరీ. ఇద్దరు అత్తల ముద్దుల అల్లుడు తను. ఇద్దరికీ పెళ్లీడుకొచ్చిన కూతుళ్లు ఉండేవారు. పిల్లని మేమిస్తామంటే మేమిస్తామంటూ పోటీపడ్డారు. ఒకర్ని చేసుకుంటే మరొకరికి కోపం. 'తేడా వస్తే...నిన్ను కిడ్నాప్ చేసేస్తాం ఖబడ్దార్...' అంటూ బంధువుల హెచ్చరికలొకటి. మొత్తానికి రాజీ కుదిరింది. దోస్తుకు ధైర్యం ఇవ్వడానికి ట్రైలక్ బ్యాచ్ మొత్తం పెళ్లికెళ్లింది.

దశరథ్ మొదట్లో టీవీలకు పనిచేసేవాడు. ఆ పనులన్నీ చక్కదిద్దుకుని... ఏ అర్ధరాత్రో ట్రైలక్‌కు చేరుకునేవాడు. ఆ సమయంలో కూడా... జోరుగా చర్చలు జరిగేవి. కట్టేసేదాకా ట్రైలక్‌లో, కట్టేశాక ఎదురుగా ఉన్న అరుగు మీద - అంతే తేడా! రాత్రి పదిన్నరకంతా పడకేయడం పట్నాయక్ అలవాటు. ఆలస్యమైతే కళ్లు ఎర్రబడిపోయేవి. దీంతో మిడ్‌నైట్ మీటింగ్స్‌లో పెద్దగా పాల్గొనేవాడు కాదు. చందు, త్రివిక్రమ్, సునీల్ మాత్రం పక్కా నిశాచరులు. పొద్దులకందని సుద్దులు వాళ్లవి. ఏ అర్ధరాత్రి దాటాకో హఠాత్తుగా సునీల్‌కు ఆకలేసేది. రాజ్‌భవన్‌రోడ్డు నుంచి మోడల్ హౌస్ మీదుగా నడుస్తూ వెళ్లేవారు. నిమ్స్‌లో ఓ క్యాంటీన్ ఉండేది. ఏ సమయంలో వెళ్లినా అక్కడ టిఫిన్ దొరికేది. సునీల్ మార్కు పంచుల మధ్య... ప్లెయిన్ దోసె తింటున్నా 'మసాలా' లాగిస్తున్నంత మజా! అదయ్యాక ఛాయ్. తెల్లవారుజామునే, నిమ్స్ ఎదురుగా ఉన్న ఓ చిన్న కేఫ్‌కు వేడివేడి సమోసాలు వచ్చేవి. కాసేపు వాటిపనీ పట్టేవారు. ముక్తాయింపుగా మరోసారి ఛాయ్. ఇక, తక్షణ కర్తవ్యం... చంద్రసిద్ధార్థను ఇంటి దగ్గర దించేయడం. అక్కడిదాకా కలిసి వెళ్లాక... మిత్రుల్ని వదిలేసి తనమానాన తాను ఇంట్లోకి వెళ్లిపోవడం చంద్రకు ఇబ్బందిగా అనిపించేది. ఆ ఇద్దర్నీ వదిలిపెట్టడానికి తానూ వెళ్లేవాడు. బ్యాచిలర్‌రూమ్ పిట్టగోడల మీద ఇంకాసేపు బాతాఖానీ. అంతలోనే భళ్లున్న తెల్లారిపోయేది. ట్రైలక్ తలుపులు తెరుచుకునేవి.

• • •

... ఆ కుర్రాళ్లంతా సినిమా పక్షులైతే, ట్రైలక్ ఓ ఊడలమర్రి. ఆ కుర్రాళ్లంతా సినిమా చేపలైతే ట్రైలక్ రాజుగారి చెరువు. అప్పటికింకా సెల్‌ఫోన్లు రాలేదు. వచ్చినా, అందులోంచి 'ఊ...' కొట్టినా ఓ పదిరూపాయలు బిల్లు పడేది. పేజర్లదే హవా. అవీ అందరి దగ్గరా ఉండేవికాదు. ఎవరి కలలు వారికున్నా అందరి లక్ష్యమూ సినిమానే. దీంతో అడ్రస్ కూడా ఒకటే అయిపోయింది... ట్రైలక్!

ఎలాగైనా ఓ ఛాన్స్ సంపాదించాలి. ఓ బ్రేక్ తెచ్చుకోవాలి. అవే కబుర్లు. అవే చర్చలు. అదే ప్రపంచం. ఆ చర్చల మధ్యే... కథలు పుట్టేవి, పెరిగేవి, పెద్దయ్యేవి. ఆ సిగరెట్ పొగల మధ్యలోంచి పాత్రలు నడుస్తూ వచ్చేవి. ఆ ఖాళీకప్పుల గలగలల్లోంచి ట్యూన్లు ప్రాణంపోసుకునేవి. ఒకరి పర్సులో డబ్బుంటే అందరూ బేఫికర్. ఒకరికి కష్టం వస్తే అన్ని మొహాలూ చిన్నబోయేవి. అన్నీ మధ్యతరగతి జీవితాలే. అందరివీ మధ్యతరగతి కష్టాలే.

అవకాశం వచ్చినట్టే వచ్చి పుటుక్కున జారిపోతుంది. అదృష్టం తలుపు తట్టినట్టే తట్టి తుర్రున పారిపోతుంది. ఆ సమయంలో ట్రైలక్ బ్యాచ్... అమ్మ ఒడి, స్నేహితుడి భుజం, దేవుడిపటం. ఇంగ్లిష్ సినిమా వస్తే సంతోష్‌లోనో ఆనంద్‌లోనో. తెలుగు సినిమా విడుదలైతే అమరావతిలోనో మీరాలోనో... పాతిక సీట్లు ట్రైలక్ బ్యాచ్‌వే. బడ్జెట్ అనుమతిస్తే అట్నుంచి అటే ప్యారడైజ్‌కు.

అంత హాయిగా ఎలా గడిపేవాళ్లు? ఒత్తిడి లేదా? అంటే, ఉంది! దాన్ని పోగొట్టడానికి స్నేహితులున్నారుగా! భయం లేదా అంటే,

చంద్రసిద్ధార్థ 'ఇన్‌స్ట్రూకటబుల్ లవ్' అనే ఇంగ్లిష్ సినిమాను తెరకెక్కించాడు. రెండో వారం పెద్దగా వసూళ్లు లేవు. మిత్రుడి సినిమా చూద్దామని బృందమంతా బయల్దేరింది. ఏదో జోక్ వస్తే ప్రేక్షకులంతా పగలబడి నవ్వుతున్నారు. 'ట్రైలక్ బ్యాచ్' మాత్రం సీరియస్‌గా చూస్తోంది. ఆ సినిమా తీయడానికి చంద్ర పడిన కష్టాలు గుర్తుకొచ్చాయేమో. పక్క సీట్లోని ప్రేక్షకుడు అంటున్నాడు గట్టిగానే.. 'యే హౌలాహై క్యా? అంగ్రేజీ సమజ్ నై ఆరారే'. అప్పుడు నవ్వొచ్చింది మిత్రబృందానికి!

ఓసారి ఆర్పీ పట్నాయక్ వైజాగ్‌లో లైవ్ షో నిర్వహించాడు. ఆ సందడి చూడ్డానికి ట్రైలక్ బృందమంతా బయల్దేరింది. ఆరు లక్షలమంది జనం. మూడు కిలోమీటర్ల దూరం వరకూ నిలబడటానికి కూడా ఖాళీ లేదు. చిట్టచివర నిల్చుని స్టేజీ వైపు చూస్తున్న ప్రేక్షకుడిని అడిగాడో ట్రైలక్ సభ్యుడు ... 'ఇక్కడి నుంచి ఏం కనిపిస్తోంది బాబూ! హాయిగా ఇంటికెళ్లిపోవచ్చుగా' అని! 'వినిపిస్తోందిగా... చాలు!' అని జవాబిచ్చేసి పాటకోసం చెవులు రిక్కించాడు అతను. మిత్రులు కోరుకున్నదీ అలాంటి జవాబే!

'ఆ కుర్రాళ్లా? పనీపాటా లేవనుకుంటా? ఎప్పుడూ ఆ కేఫ్ దగ్గరే పడుంటారు' అంటూ తేలికచేసి మాట్లాడిన జనమే, తమ పిల్లల్ని అటువైపుకూడా వెళ్లనివ్వని పొరుగువాళ్లే... 'గుర్తున్నానా సార్! ట్రైలక్ దగ్గరే ఉండేవాళ్లం. మా అబ్బాయికి ఏదైనా అవకాశం ఇప్పించండి, ఉద్యోగం చూపించండి' అని వస్తున్నారు. ట్రైలక్ వెనకాల అన్నీ గుడిసెలు ఉండేవి. వాళ్లలో చాలామంది ఈ మిత్రబృందం చొరవతో... లైట్ బోయ్‌లుగా స్థిరపడ్డారు. ఇండస్ట్రీలో చిన్నాచితకా పనులు చేసుకుంటున్నారు.

ఉంది! ఆ సమయంలో అభయం ఇవ్వడానికి ఆత్మీయులున్నారుగా! ఎవరికివారు పిరికివాళ్లే. కానీ మూకుమ్మడిగా మహా ధైర్యవంతులు! అందరి మెడల్లో 'దోస్తానా' తావీజులున్నాయ్!

• • •

అప్పటిదాకా అసిస్టెంట్ డైరెక్టర్లుగా, ఘోస్ట్ రైటర్లుగా, బుల్లితెర రచయితలుగా బండి నడిపిస్తున్న ట్రైలక్‌బ్యాచ్ మిత్రులకు తొలి బ్రేక్ వచ్చింది. వేణు హీరోగా 'స్వయంవరం' మొదలైంది. శ్యాంప్రసాద్ అనే ఫ్రెండ్ వేణూ కోసమే నిర్మాత అవతారం ఎత్తాడు. ఆ బృందానికి అదో మంచి అవకాశం, అదో పెద్ద సవాలు కూడా! దర్శకుడిగా విజయభాస్కర్‌ను కుదుర్చుకున్నారు. హీరోయిన్‌గా ఎవర్ని తీసుకోవాలి? అన్న ప్రశ్న వచ్చినప్పుడు అంతా 'లయ'కు ఓటేశారు. ఆర్పీ, సునీల్ విజయవాడ వెళ్లి వాళ్లమ్మగార్ని ఒప్పించారు. లయ తనకూ ఓకే అంది. 'కానీ, నాన్న ఏమంటారో' అన్న సందేహం. ఆయన తిరుపతిలో ప్రొఫెసర్. మిత్రులిద్దరూ తిరుపతి బస్సెక్కారు. ఆ యువకుల మాటల్లోని నిజాయతీ ఆయనకు నచ్చింది. చేతుల్లో చెయ్యేసి... 'మా అమ్మాయి భవిష్యత్తు మీ చేతుల్లో పెడుతున్నా..' అంటూ గ్రీన్‌సిగ్నల్ ఇచ్చారు. త్రివిక్రమ్ స్క్రీన్‌ప్లే రాశాడు. గోపీమోహన్, హరి, మద్దినేని రమేశ్, సందేశ్, కెమెరా డిపార్ట్‌మెంట్‌లో సుధాకర్ ఎక్కంటి , రేవన్ యాదు, గిరిధర్... దాదాపుగా పదిహేను మందిది ట్రైలక్ బ్యాచే! 'నా తొలి హీరో వేణు. ట్రైలక్‌లోనే చాలా సీన్స్ రాసుకున్నా' అంటూ ఆమధ్య ట్విటర్‌లో వేణుకు పుట్టినరోజు శుభాకాంక్షలు చెప్పాడు త్రివిక్రమ్. ఆ సినిమా తర్వాత త్రివిక్రమ్ వెనక్కి తిరిగి చూడలేదు. మాటల మాంత్రికుడు తిరుగులేని దర్శకుడు కావడానికి ఎంతో సమయం పట్టలేదు.

'చిత్రం'తో ఆర్పీకి బ్రేక్ వచ్చేసింది. అప్పుడెప్పుడో తను వినిపించిన ట్యూన్స్ చిత్రంగా ఉన్నాయనిపించి ఆఫీసుకు పిలిపించాడు తేజ. 'సంతోషం' దశరథ్‌కు టర్నింగ్ పాయింట్. 'మా గ్రూప్‌లో సెలబ్రిటీ స్టేటస్ మొదట వచ్చింది ఆర్పీకే. ఆ తర్వాత సునీల్‌కి ఆర్టిస్ట్‌గా వచ్చింది. ఆ సినిమా హిట్‌లో ట్రైలక్ బ్యాచ్‌లోని చాలా మంది బాధ్యులే. నేనో పాట రాశా. ఆ పాటతోనే తొలిసారి షీల్డ్ అందుకున్నా' అంటూ జ్ఞాపకాల్ని నెమరేసుకుంటాడు చంద్రసిద్ధార్థ.

బాల రాజశేఖరుని హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ నుంచి థియేటర్స్‌లో మాస్టర్స్ చేసేవాడు. పగలంతా పాఠాలు విని, సాయంత్రం 'అకడమిక్ డిస్కషన్స్' కోసం ట్రైలక్‌కు చేరుకునేవాడు. చదువైపోయాక, రిసెర్చ్ కోసం అమెరికా వెళ్లాడు. చాలా ఇంగ్లిష్ సినిమాలకు పనిచేశాడు. ప్రస్తుతం అన్నపూర్ణ ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌కు డీన్‌గా వ్యవహరిస్తున్నాడు. 'ట్రైలక్ బ్యాచ్ అనేది... పాఠశాల లాంటి ఇరానీకేఫ్' అంటాడు బాల.

• • •

ఒకరికొకరు... నియమాన్ని ట్రైలక్ బ్యాచ్ ఎప్పుడూ మరచిపోలేదు. తమలో ఎవరికి అవకాశం వచ్చినా మరొకర్ని లాక్కెళ్లే ప్రయత్నం చేశారు. అవసరం అయితే చిన్నచిన్న త్యాగాలూ చేసుకున్నారు. ఓసారి... పట్నాయక్‌కు అసిస్టెంట్ డైరెక్టర్‌గా అవకాశం రావడం కోసం, సునీల్ ఉద్దేశపూర్వకంగా ఓ అడుగు వెనకేశాడు. ఎందుకంటే, అక్కడ ఉన్నది ఒకటే ఖాళీ. పట్నాయక్ సంగీత దర్శకుడిగా ఓ వెలుగు వెలుగుతున్న సమయంలో ఇంటిముందు 'పాటల రచయితలూ క్షమించండి....' అన్న అర్థం వచ్చేలా ఓ బోర్డు ఉండేది. పాట వినిపిస్తామంటూ వచ్చి తమ పైత్యమంతా కక్కేస్తున్న నసకవులతో సమయం వృథా కాకుండా ఆర్పీ చేసుకున్న ఏర్పాటు అది. ఆ బోర్డు చూసి... ఓ ట్రైలక్ మిత్రుడూ నిరాశగా వెనక్కి వెళ్లిపోయాడు. ఆ తర్వాతో ఫిల్మ్‌ఫెస్టివల్‌లో మరో ట్రైలక్ సభ్యుడికి తారసపడ్డాడు. 'ఆ గమనికలూ హెచ్చరికలూ మనకు వర్తించవు మిత్రమా' అంటూ నేరుగా పట్నాయక్ స్టూడియోకు



తీసుకెళ్లాడా నేస్తం. ఆ పాటల రచయిత పేరు చైతన్యప్రసాద్. చంద్ర సిద్ధార్థ స్నేహితుడిగా బ్యాచ్‌లోకి వచ్చాడు. తాజాగా 'బాహుబలి'కి కూడా మంచి పాటలు అందించాడు.

తొలిరోజుల్లో, సునీల్‌కు బ్రేక్ ఇవ్వాలని మిత్రబృందమంతా తీర్మానించింది. తనకోసమే అన్నట్టు 'స్వయంవరం'లో ఓ పాత్ర కూడా సృష్టించింది. అంతలోనే రామ్‌గోపాల్‌వర్మ 'ప్రేమకథ'లో కూడా సునీల్‌కు ఛాన్స్ వచ్చింది. అక్కడా ట్రైలక్ మిత్రులే కాబట్టి, వర్మ చిత్రాన్నే ఎంచుకున్నాడు సునీల్. తొలిరోజే, కెమెరాలోంచి సునీల్‌ను చూడగానే, 'ఎవరి తను ఇంత డామినేటింగ్‌గా ఉన్నాడు. మార్చేయండి. వేరొకర్ని పెట్టేద్దాం' అని చెప్పి విసవిసా వెళ్లిపోయాడు వర్మ. 'కాదు సర్! తను బాగా చేస్తాడు. ఓ అవకాశం ఇద్దాం' అని చెప్పగలిగేంత ధైర్యం ఎవరికుంది? అంతా కొత్తవాళ్లే, అందరూ కుర్రవాళ్లే. సునీల్ ఆ బాధలోంచి బయట పడటానికి చాలా సమయం పట్టింది. ట్రైలక్ బ్యాచ్ లేకపోతే, డిప్రెషన్‌లోకి వెళ్లేవాడేమో. చంద్ర సిద్ధార్థ తీస్తున్న 'ఔనంటూ కాదంటూ' ఆగిపోయినప్పుడైతే, తమకే ఏదో తీవ్ర నష్టం జరిగినంత విషాదం అందర్లో. ఓసారి సునీల్‌కు యాక్సిడెంట్ అయ్యింది. తీవ్ర గాయాలు అయ్యాయి. ఆ సమయంలో త్రివిక్రమ్ తన స్నేహితుడిని కంటికి రెప్పలా చూసుకున్నాడు. అన్నివిధాలా అండగా నిలిచాడు. ఆ సాయాన్ని సాయంగా, ఆ త్యాగాన్ని త్యాగంగా ఇద్దరూ భావించలేదు. అదో బాధ్యతనే అనుకున్నారు. మిత్రధర్మం కిందే లెక్కగట్టారు.

• • •

'ట్రైలక్ కుర్రాళ్లు సక్సెస్ అయ్యేకొద్దీ... ట్రైలక్ కేఫ్‌కు రద్దీ పెరగసాగింది. అప్పటిదాకా అక్కడ, పాత బజాజ్ స్కూటర్లు ఆగడమే గొప్ప. మెల్ల మెల్లగా బెంజికార్లు రావడం మొదలైంది. ఇరుకిరుకు బల్లల ముందు... కోట్ల బడ్జెట్ సినిమాలు ఖరారు అయ్యేవి.

రెక్కలు వస్తున్న పిల్లలకి వీడ్కోలు చెప్పిన తల్లి పక్షిలా, ఒకానొక అర్ధరాత్రి ట్రైలక్ కేఫ్ శాశ్వతంగా మూతపడింది. రెండ్రోజుల్లో కూలబడింది. ఆ స్థానంలో షాపింగ్ కాంప్లెక్స్ వెలిసింది. ఇప్పుడు ట్రైలక్ కేఫ్ లేదు. కానీ ట్రైలక్ బ్యాచ్ ఉంది. బ్రహ్మాండంగా ఉంది. తెలుగు సినిమాను ఏలేస్తోంది.

ఎవరి కెరీర్‌లో వాళ్లు తలమునకలై ఉన్నారు. మునుపట్లా 'కలుద్దాం...' అనుకోగానే ఏ రెస్టారెంట్‌లోనో వాలిపోయేంత తీరిక ఎవరికీ లేదు. అయినా సరే, అవకాశాల్ని కల్పించుకుని, వీలైతే సృష్టించుకుని అప్పుడప్పుడూ భేటీ అవుతోందా మిత్రబృందం. రోజువారీ బాతాఖానీకి ఉండనే ఉంది...'ట్రైలక్ బ్యాచ్' వాట్సప్ గ్రూప్!

జీవితంలో ఉన్నట్టే, జీవితాన్ని ప్రతిబింబించే సినిమాలో ఉన్నట్టే... ట్రైలక్ బ్యాచ్ లోనూ జయాలూ అపజయాలూ ఆనందాలూ విషాదాలూ... అనేకం!

పేటో... మరణం ఆ మిత్రులకు ఓ షాక్. తన పేరు తుమ్మల చక్రవర్తి. సినిమా ఎన్‌సైక్లోపిడియా. హాలీవుడ్ సినిమాలేంటి? వాటి దర్శకులెవరు? వాళ్ల సినిమాలేంటి? ఆ సినిమాలకు ఆధారాలు ఎక్కడ? వరల్డ్ మ్యూజిక్ ట్రెండ్స్ ఎలా ఉన్నాయ్?... ఇలాంటి విషయాలన్నీ చకచకా చెప్పేవాడు. ట్రైలక్ చాయ్ తప్పించి మరో అలవాటు లేదు చక్రవర్తికి. ఒకట్రెండు సినిమాలకు పనిచేశాడు కూడా. అంతలోనే, జీవితానికి ప్యాకప్ చెప్పేసి, క్యాన్సర్‌తో చనిపోయాడు. సరిగ్గా ఆ సమయానికి చంద్రసిద్ధార్థ 'ఆ నలుగురు' సినిమాలో రాజేంద్రప్రసాద్ పాత్ర మరణ యాత్రను షూట్ చేస్తున్నాడు.

• • •

'ట్రైలక్ బ్యాచ్' లేకపోతే?

'మేం లేం, మా విజయాల్లేవు. మా జీవితాలే లేవు' - అంటారంతా ముక్తకంఠంతో.

నిజమే, మన సినిమా హిట్టయితే, 'సూపర్ హిట్ కొట్టాం' అన్న విజయానందం.

దోస్తు సినిమా హిట్టయితే, 'ట్రైలక్ బ్యాచ్ మరో హిట్టు కొట్టింది' అన్న మిత్రానందం.

అంతా ఆనందమే.

స్నేహంలోని గొప్పదనమే అది.

హ్యాపీ ఫ్రెండ్‌షిప్ డే... 'ట్రైలక్ బ్యాచ్'!

**- డాక్టర్ చల్లా భాగ్యలక్ష్మి**

ఫొటోలు: **గోపీకృష్ణ**

**ట్రైలక్‌బ్యాచ్‌లో చురుకైన సభ్యులే అయినా, రోజుకు పది గంటలు ట్రైలక్ కేఫ్‌లోనే గడిపినా... చాయ్ కప్పు ముట్టని వ్యక్తులు ఇద్దరు... ఒకరు ఆర్పీ పట్నాయక్, మరొకరు ఆయన సివిల్స్ స్నేహితుడు రామ్ ధన్. ఇదే విషయం మీద ఆర్పీకీ పేటోకీ చిన్నపాటి గొడవ కూడా జరిగింది. 'అసలు నువ్వు ఏమనుకుంటున్నావ్.. టీలూకాఫీలూ తాగకుండా సినిమా పరిశ్రమలో ఉందామని అనుకుంటున్నావా? ఇది సాధ్యమేనా?' అని వాదించాడు పేటో. 'ఉంటా.. సాధ్యమే' అన్నాడు పట్నాయక్. 'ఎన్నాళ్లిలా జరుగుతుందో చూద్దాం' అంటూ సవాలు విసిరాడు పేటో. 'జీవితకాలం' అని తాపీగా చెప్పాడు ఆర్పీ. 'అలా వద్దులే ఓ పదేళ్లు పెట్టుకుందాం' అంటూ పందానికి గడువు విధించాడు పేటో. ఆ పదేళ్లు నిండకమునుపే పేటో చనిపోయాడు.**

**'ట్రైలక్' రోజుల్లోనే ఇంటర్నెట్ వచ్చింది. గోపీమోహన్ రోజుకు పద్దెనిమిది గంటలు నెట్ సెంటర్‌లో గడిపేవాడు. గంటకు నలభై రూపాయలు అద్దె అయినా సరే. ఆదిత్య ఎన్‌క్లేవ్‌లో మెయిల్ ఐడీ కొట్టి కిందికి వచ్చి ఛాయ్ తాగి వెళ్లాక కానీ, నెట్ ఓపెన్ అయ్యేది కాదు. ఆ సమాచారాన్నంతా ఫ్లాపీల్లో కాపీ చేసుకునేవాడు. ఫ్లాపీని పట్టుకుని మెహిదీపట్నంలోని జయభూషణ్ హాస్పిటల్‌కు వెళ్లేవాడు. అక్కడ గోపీ బంధువు పనిచేసేవారు. 'ఒకట్రెండు ప్రింట్లున్నాయ్...' అని అడిగితే కాదనేవారు కాదు. తీరా ప్రింటుకొట్టడం మొదలుపెడితే... అంతు ఉండేది కాదు.**



# మిక్స్చర్ పొట్లం

బొమ్మలు : **వెంకట్**

## పనికి కొత్త బాసూ



**చై**న్ స్నాచింగ్ చేసి, పోలీసులకు దొరికిపోయాడు రాజు.

**పోలీసు:** ఏంటీ... చైన్‌స్నాచింగ్ చేయడం ఇదే మొదటిసారా...

రాజు: అవును సార్... మీరెలా కనిపెట్టారు.

పోలీసు: అమ్మాయి మెడలో చైన్ వదిలి, కుక్క మెడలో చైన్ కొట్టేశావంటే... కనిపెట్టరూ...!

## చాలా తేలిక

**డి**శ్చార్జ్ అయి వెళ్లిపోతున్న పేషెంట్‌తో...

**డాక్టర్:** ఇప్పుడు తేలిగ్గానే అనిపిస్తోందా?

**రోగి** (పర్సు తడుముకుంటూ): హా... చాలా తేలిగ్గా అనిపిస్తోంది.

## కర్మఫలం

**రా**కేష్ విజయవాడ స్టేషన్లో రైలు ఎక్కాడు. రైల్లో జనం కిక్కిరిసి ఉన్నారు. కూర్చోడానికి ప్లేస్ లేదు. మనోడికి ఒక ఐడియా వచ్చింది. సంచిలో నుంచి ఒక ప్లాస్టిక్ పామును తీసి "పాము... పాము..." అని అరిచాడు.

ఆ బోగీలోని జనమంతా భయపడి దిగిపోయారు. "హమ్మయ్య" అనుకుని, ప్లాస్టిక్ పామును బ్యాగులో పెట్టుకుని బెర్త్ ఎక్కి పడుకున్నాడు రాకేష్. పడుకున్న వెంటనే నిద్రపట్టేసింది. మర్నాడు ఉదయం మెలకువ వచ్చింది. లేచి "అబ్బా ఒక్కడూ లేడు బోగీలో... ఒక్క ప్లాస్టిక్ పాముకే అందరూ దిగిపోయారు. హాయిగా ఒక్కడినే పడుకున్నా" అనుకుని, ఆవలిస్తూ రైలు దిగి చూస్తే, రాత్రి ఎక్కడ రైలు ఎక్కాడో అక్కడే ఉన్నాడు. ఆశ్చర్యంగా అనిపించి, అక్కడున్న టీసీని పిలిచి "ఏంటి? రాత్రి రైలు వెళ్లలేదా?" అని అయోమయంగా అడిగాడు. "రాత్రి ఇందులో ఎవరికో పాము కనిపించిందంట! అదెక్కడో దూరిపోయింది. ఎంత వెతికినా దొరకలేదు. దాంతో పామున్న ఈ బోగిని ఇక్కడే వదిలేసి, వేరే బోగిని తగిలించుకుని వెళ్లిపోయారు" అసలు విషయం చెప్పాడు టీసీ.

## ఒట్టు మీద ఒట్టు

**కొడుకు:** నాన్నా... ఒట్టు అంటే ఏంటి?

**తండ్రి:** పచ్చి అబద్ధాన్ని నిజమని నమ్మించడానికి తరతరాలుగా వాడుతున్న టెక్నిక్!

## నిజమే...



**అ**బ్బాయిల
మనసు
దేవాలయం...
అందుకే
అబ్బాయిలు
ఐ లవ్ యూ చెప్పగానే, వెంటనే
చెప్పులు తీస్తారు అమ్మాయిలు.

## నెట్ కుటుంబం



**ఏ**కలింగం సోషల్ మీడియా ప్రభావంతో తన కుటుంబాన్ని ఇలా పరిచయం చేశాడు.

"ఈమె నా భార్య గూగుల్ రాణి- ఒక్కటి అడిగితే పది చెబుతుంది. వీడు నా కొడుకు ఫేస్‌బుక్ కుమార్- ఇంట్లో విషయాలన్నీ లోకానికి అందజేస్తాడు. ఈమె నా కూతురు ట్విట్టర్ కుమారి- కాలనీ మొత్తం తననే ఫాలో అవుతారు. ఈవిడ మా అమ్మ వాట్సప్ మాత- రోజంతా బుడ్‌బుడ్‌మని చప్పుడు చేస్తూనే ఉంటుంది. ఇక నేను ఆర్కుట్ ఏకలింగాన్ని- నన్నెవడూ పట్టించుకోడు".

# తెర మీద తండ్రిగా 'ఫిదా'

**'మాభూమి' సాయిచంద్ మరోసారి తెరమీదికి వచ్చారు. ఒకటి కాదు రెండు కాదు... 25 ఏళ్ల తర్వాత. అనేక అభ్యుదయ చిత్రాల్లో హీరోగానే కాకుండా... 'మంచుపల్లకీ'లో హీరో మిత్రుడిగా, 'శివ'లో హీరోయిన్ అన్నగా... సుమారు 30కి పైగా సినిమాల్లో నటించిన సాయిచంద్ 'అంకురం' సినిమా తర్వాత నటనకు దూరంగా ఉన్నారు. మళ్లీ ఇన్నాళ్లకు అభ్యుదయ భావాలున్న తెలంగాణ రైతుగా, ఇద్దరు అమ్మాయిలకు తండ్రిగా ఆయన కనబర్చిన నటనకు ప్రేక్షకులు 'ఫిదా' అయ్యారు. ఇన్నేళ్ల తర్వాత సాయిచంద్‌ను రైతు పాత్రకు దర్శకుడు శేఖర్‌కమ్ముల ఒప్పించడం ఒక విశేషమైతే, పెళ్లిచేసుకోకుండా ఇన్నాళ్లు ఒంటరిగానే ఉన్న సాయిచంద్ తండ్రి పాత్ర పోషించడం ఇంకో విశేషం. "ప్రేక్షకులతో పాటు నేను కూడా 'ఫిదా' అయ్యాను. పెళ్లి చేసుకోకున్నా, సినిమా వల్ల తండ్రితనాన్ని చక్కగా ఆస్వాదిస్తున్నా" అంటూ సాయిచంద్ చెప్పిన విశేషాలివి...**




ప్రపంచంలో ప్రతీచర్యకు ఒక కనెక్టివిటీ ఉంటుంది. ఒకదానికొకటి లింకు ఉంటుంది. పూజలు పునస్కారాలు చేయనప్పటికీ, గుళ్లకు వెళ్లనప్పటికీ నేను దేవుణ్ణి నమ్ముతా. ప్రతీరోజూ ఇంట్లో సాయిబాబా విగ్రహం ముందు కూర్చుని నా భావాలను, బాధలను, కోపాన్ని ఆయనతో పంచుకుంటా. ఎందుకంటే నా పేరు వెనుక ఆయనే ఉన్నారు. పురిట్లోనే పోతాననుకున్న నేను బతకడానికి ఆయనే కారణమనే నమ్మకంతో నాకు సాయిచంద్ అనే పేరు పెట్టారట. 'ఫిదా'లో నా కూతురుగా వేసిన అమ్మాయి పేరు సాయిపల్లవి. 'తను కడుపులో ఉన్నప్పుడు కలలో సాయిబాబా దర్శనమిచ్చాడని అందుకే ఆ పేరు పెట్టా'నని సాయిపల్లవి తల్లి నాతో చెప్పారు. నాలాగే సాయిపల్లవి కూడా సాయి భక్తురాలు. ఇదొక కనెక్షన్.

గత యేడాది నేను 60వ వసంతంలోకి అడుగిడిన రోజు... నా మొబైల్‌కు 'ఈజిట్ సాయిచంద్' అనే ఒక మెసేజ్ వచ్చింది. పుట్టినరోజు హడావిడిలో నేను పెద్దగా పట్టించుకోలేదు. కానీ అదేపనిగా మెసేజ్‌లు వస్తున్నాయి. కాస్త బిజీ తగ్గిన తర్వాత కాల్ చేద్దామనుకున్నా. వీలు పడలేదు. ఈలోపే ఫోన్. అవతలి నుంచి శేఖర్ కమ్ముల, నాకిష్టమైన దర్శకుడు. 'నా సినిమా చేస్తారా?' అని అడిగారు. నాకేమనాలో అర్థం కాలేదు. అభ్యుదయ భావాలున్న తెలంగాణ రైతు పాత్రకు సరైన నటుడి కోసం ఇంటర్నెట్‌లో వెదుకుతుంటే నా ఫోటో కనిపించిందట. నేనే సరైన ఛాయిస్ అనుకున్నారట. హీరోయిన్‌కు తండ్రి అనగానే సగం చచ్చిపోయాను. నేనేమో బ్యాచిలర్‌ని, తండ్రి పాత్ర ఎలా వేస్తానంటే 'నాదీ భరోసా' అన్నారాయన. సుమారు 37 ఏళ్ల క్రితం 'మాభూమి'లో తొలిసారిగా నన్ను చూసినప్పుడు గౌతంఘోష్ కూడా అలాగే భరోసా ఇచ్చారు. మరో కనెక్షన్.

నేను ఏ పని మొదలెట్టినా, ఏ పాత్ర వేసినా ఇద్దరికి తప్పకుండా చెప్తాను. వాళ్లిద్దరూ బి.నర్సింగరావు, గౌతంఘోష్. తెలంగాణ నేపథ్యం కావడంతో తప్పకుండా చెయ్యమన్నారు నర్సింగరావు. 'స్విమ్మింగ్, సైక్లింగ్ లాంటిదే నటన కూడా. ఒకసారి వస్తే పోవు' అంటూ ప్రోత్సహించారు గౌతంఘోష్. ఆ విధంగా 'ఫిదా' సీన్‌లోకి వచ్చాను. ఏ సినిమాకైనా షూటింగ్‌కు ముందు వర్క్‌షాప్ పెట్టే అలవాటున్న శేఖర్‌కమ్ముల హీరోయిన్ సాయిపల్లవితో ఒక సీన్ కోసం రమ్మన్నారు. ఇంట్లో తండ్రీకూతుళ్ల అనుబంధాన్ని తెలిపే కొన్ని ఫోటోలు మా ఇద్దరి కాంబినేషన్‌లో తీశారు. షూటింగ్ పూర్తిచేసుకుని వస్తుండగా





'నాన్నా' అని పిలుపు వినిపించింది. వెనక్కి తిరిగి చూస్తే సాయిపల్లవి పరుగెత్తుకుంటూ వచ్చి 'నాన్నా' అంటూ కౌగిలించుకుంది. నేను ఒక్కసారిగా షాక్. పదేళ్లు నిండకముందే తల్లిదండ్రులను పోగొట్టుకున్న నాకు, ఇన్నేళ్లు పెళ్లెందుకు చేసుకోలేదో కారణం తెలియని నాకు... ఆ పిలుపు, ఆ ఆలింగనం కొత్త అనుభూతినిచ్చింది. తండ్రితనం తొలిసారిగా అనుభవంలోకి వచ్చింది. ఇంకో కనెక్షన్.

• • •

25 ఏళ్ల తర్వాత 'ఫిదా'తో మరోసారి ముఖానికి రంగేసుకున్నప్పటికీ 50 ఏళ్ల క్రితమే 'సతి అరుంధతి'లో బాలనటుడిగా తెరంగేట్రం చేశాను. నాన్నగారికి(త్రిపురనేని గోపీచంద్) సాహిత్యంతో పాటు సినిమాలతో కూడా అనుబంధం ఉంది కాబట్టి మా ఇంట్లో సినిమా సంస్కృతి కనిపించేది. న్యాయపతి రాఘవరావు, కామేశ్వరిల ఆధ్వర్యంలో నిర్వహించే 'బాలనందసంఘం'లో చిన్నప్పుడే నాటికలు వేసేవాణ్ణి. సి.ఎస్.రావు దర్శకత్వంలో జమున, కాంతారావు, గుమ్మడిలతో తీస్తున్న 'సతి అరుంధతి' సినిమాలో బాలనటులు కావాలంటే నన్ను పంపించారు. 70వ దశకంలో 'గోపీచంద్ ఆర్ట్స్' పేరిట అన్నయ్య డాక్టర్ రమేష్ ఆధ్వర్యంలో అనేక నాటకాలు వేసిన అనుభవం ఉంది. అప్పుడే బి.నర్సింగరావు, చంద్ర, దేవీప్రియ, తోట వైకుంఠం, మధుకోడాలతో పరిచయమైంది. 'మాభూమి' సినిమా కోసం నటీనటుల ఎంపిక సమయంలో దేవీప్రియగారు నా పేరు సజెస్ట్ చేశారు. అర్జంట్‌గా ఒకసారి 'మాభూమి' ఆఫీసుకు (అప్పట్లో పంజాగుట్టలో ఉండేది) రమ్మని మోహన్‌కోడా ఇంట్లో స్లిప్ పెట్టారు. సాయంత్రం ఆఫీసుకు వెళ్తే నర్సింగరావుగారు నన్ను గౌతంఘోష్‌కు చూపించారు. ఆయన నన్ను రకరకాల యాంగిల్స్‌లో చూసి ఒకసారి చొక్కా విప్పమన్నారు. ఆ తర్వాత 'యూ ఆర్ మై హీరో' అన్నారు. కిషన్‌చందర్ రచించిన 'జబ్ ఖేత్ జాగే' నవలను అప్పటికే చాలాసార్లు చదివి ఉన్నాను కాబట్టి 'ఆ పాత్ర నేను వేయగలనా' అని సందేహిస్తుంటే 'నువ్వే వేస్తావు' అని భరోసా ఇచ్చారు. అప్పటికి నా వయసు 22 ఏళ్లు మాత్రమే. 'మా భూమి' షూటింగ్ చాలాకాలం జరిగింది. ఎట్టకేలకు 1980లో విడుదలై సంచలన విజయం నమోదు చేసింది. మద్రాస్‌లో ఆ సినిమా ప్రివ్యూకు వచ్చిన ధవళ సత్యంగారు నన్ను క్యాజువల్ డ్రెస్‌లో చూసి 'యువతరం కదలింది'లో నటించమన్నారు. ఆ తర్వాత 'మరో మలుపు', 'ధర్మవడ్డీ', 'మంచుపల్లకీ' 'విముక్తి కోసం' సినిమాల్లో చేశాను.

**ఆర్జీవీ 'మాభూమి'కి వీరాభిమాని...**

అప్పట్లో పంజాగుట్టలోని 'మాభూమి' ఆఫీసు పక్కనే రామ్‌గోపాల్ వర్మ ఇల్లు ఉండేది. ఆఫీసు ముందు పోస్టర్లుండేవి కాబట్టి అతడు నన్ను గొప్పగా చూసేవాడు. 'మాభూమి' డైలాగులన్నీ చెప్పేవాడు. 'శివ' సినిమాకు దర్శకత్వం చేస్తున్నప్పుడు అందులో హీరోయిన్ అన్న పాత్రను నాకు ఆఫర్ చేశాడు. చేసింది కొన్ని సీన్లే అయినా 'శివ' సంచలనం సృష్టించడంతో ఆ తర్వాత అలాంటి పాత్రలే చాలా వచ్చాయి కానీ నిరాకరించాను. సినిమాను నేనెప్పుడూ ఒక ఆర్ట్‌పీస్‌లాగే చూశాను. డబ్బు సంపాదన కోసం నటనను వృత్తిగా ఎంచుకోలేదు. నాకా అవసరం కూడా లేదు. ఉమామహేశ్వరరావు 'అంకురం'లో ఓంపురి, రేవతి వంటి గొప్పవారితో కలిసి నటించడం ఒక మర్చిపోలేని అనుభూతి. అయితే అదే సమయంలో దూరదర్శన్‌కు పలు కార్యక్రమాలు చేస్తూ బిజీగా మారాను. ఆ తర్వాత కేంద్ర ప్రభుత్వానికి కొన్ని ప్రాజెక్టులు చేశాను. కార్పొరేట్ ఫిలిమ్స్ కూడా తీస్తున్నా. నాకిష్టమైన వృత్తిలో నేను బిజీగా ఉండటం వల్ల నటనకు దూరమవుతున్నాననే ఫీలింగ్ నాకెప్పుడూ రాలేదు. మళ్లీ ఇన్నేళ్ల తర్వాత నటుడిగా మారతానని కూడా ఊహించలేదు. అయితే నేను ఇంతకుముందు చెప్పినట్టు ప్రతీదానికి ఒక కనెక్టివిటీ ఉంటుంది కాబట్టే 25 ఏళ్ల తర్వాత సినిమాలకు కనెక్ట్ అయ్యాను. కానీ ఒక్కటి మాత్రం నిజం. 'ఫిదా'లో నటించేందుకు నేను ఒప్పుకోకపోతే తండ్రితనానికి దూరమయ్యేవాణ్ణి. సినిమా చూసిన చాలామంది అమ్మాయిలు, అబ్బాయిలు నన్ను స్వంత తండ్రిలా భావించి అభినందిస్తుంటే ఆనందంగా ఉంది. రెగ్యులర్ తండ్రిగా కనిపిస్తే (అనుష్కకో, తమన్నాకో తండ్రిగా) ఇంత ఆదరణ దక్కేది కాదు. శేఖర్‌కమ్ముల గొప్పదనం ఏమిటంటే అతడి సినిమాలో ఏ పాత్రైనా బలంగా ఉంటుంది. దానికో పర్పస్ ఉంటుంది. ఎలాంటి ఇమేజ్‌లేని నేను, సాయిపల్లవి, శరణ్య తండ్రీకూతుళ్లుగా నటించలేదు. మేము తండ్రీకూతుళ్లలా ఉన్నాం కాబట్టే సినిమా ప్రేక్షకులకు అంత బాగా కనెక్ట్ అయ్యింది. ప్రస్తుతం ఆ అనుభూతిని సంపూర్ణంగా ఆస్వాదిస్తున్నా. మా ముగ్గురక్కలు, వారి పిల్లలు మాత్రం నన్ను తెరమీద నాన్నగా చూసి నవ్వుతున్నారు.

● చల్లా శ్రీనివాస్

- ఫిట్‌నెస్‌కు ప్రాధాన్యత ఇస్తా.
- పెళ్లి ఎందుకు చేసుకోలేదు అనే ప్రశ్నకు నా దగ్గర సరైన సమాధానం మాత్రం లేదు.
- వివేకానందుడి సాహిత్యం బాగా చదివా. ఆయన ప్రభావం నాపై ఉంది.
- 'ఫిదా' హీరోయిన్ సాయిపల్లవి డాక్టర్ కూడా. ఆమె నాతో 'టేక్ కేర్' అన్నప్పుడల్లా 'నా కూతురు డాక్టర్. నేనెందుకు భయపడాలి' అనేవాణ్ణి సరదాగా.
- తాతగారి (త్రిపురనేని రామస్వామి చౌదరి) బయోగ్రఫీ తీయాలనే కోరిక ఉంది.
- రేషనలిస్టు కుటుంబంలో నుంచి వచ్చినా దేవుణ్ణి నమ్ముతా.
- ఆర్ట్ అంటే ఇష్టం. ఎక్కడ ఆర్ట్ ఎగ్జిబిషన్ జరిగినా వెళ్తుంటా.

జ్ఞానానందదాయకుడు...

# హయగ్రీవుడు

'జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే'

**...చాలామందికి సుపరిచితమైన విద్యారంభ శ్లోకమిది. చదువులకు అధిదేవత సరస్వతీదేవి. మళ్లీ ఈ హయగ్రీవుడు ఎవరు? జ్ఞానం కోసం ఆ స్వామిని ఎందుకాశ్రయించాలి? అన్న సందేహాలు కలగటం సామాన్యమే. అదంతా తెలియాలంటే హయగ్రీవ అవతార క్రమాన్ని అర్థం చేసుకోవాలి.**



శ్రావణ పూర్ణిమనాడు హయగ్రీవుడు ఆవిర్భవించాడు. విష్ణువే అలా ఓ విశిష్ట అవతారాన్ని ధరించాడు. హయగ్రీవం అంటే గుర్రపు ముఖమని అర్థం. మెడ నుంచి పైదాకా గుర్రపు ముఖంతోనూ, మెడ కింద భాగమంతా మహావిష్ణువు పోలికలతోనూ ఉండడం అవతార విశేషం. ఈ దేవుడిని అర్చిస్తే విద్యలు, తెలివితేటలు దైవప్రసాదంగా లభిస్తాయన్నది భక్తుల విశ్వాసం. తెల్లని దేహఛాయతో, అంతకంటే తెల్లని దుస్తులతో కొలువైనట్టు ఈ స్వామిని పురాణాలు వర్ణించాయి.

**ఎన్నో కథలు...**

హయగ్రీవస్వామి కాలానికి అందనివాడు. సృష్టికి ముందున్నవాడు. సృష్టికర్త అయిన బ్రహ్మకు సృష్టి చేసే జ్ఞానాన్ని ఇచ్చేది వేదాలే. అందుకే, ఆ వేదాల సంరక్షణలో నిరంతరం మహావిష్ణువు నిమగ్నమై ఉంటాడు. అందుకోసమే విష్ణువు హయగ్రీవ అవతారాన్ని ధరించాడు. సృష్టి ప్రారంభంలో ఓసారి, మహావిష్ణువు నాభి కమలంలో కూర్చొని ఉన్న బ్రహ్మ తన పనిలో తాను నిమగ్నమై ఉన్నాడు. ఇంతలో మధుకైటభులు మెల్లగా వెనుక నుంచి వచ్చి వేదాలను అపహరించారు. చూస్తుండగానే ఆ ఇద్దరు రాక్షసులూ సముద్రజలాలలో అట్టడుగునకు వెళ్ళిపోయారు. వేదాలు లేకపోతే సృష్టి చేయడం ఎలా? అని విచారించసాగాడు బ్రహ్మ. ఆ సంక్షోభ సమయంలో ఆయనకు విష్ణువు గుర్తుకొచ్చాడు. వెంటనే విష్ణువును స్తుతించాడు. పరిస్థితి తీవ్రతను గమనించిన విష్ణుమూర్తి క్షణాలలో ఒక దివ్య శరీరాన్ని పొందాడు. ఈ హయగ్రీవ స్వరూపంతో రసాతలానికి చేరాడు. అక్కడ స్వామి ఉదాత్త, అనుదాత్త స్వరయుక్తంగా సామవేదాన్ని గానం చేశాడు. ఆ మధుర గానవాహిని రసాతలమంతా మారుమోగింది. ఆ గానరసం రసాతలంలోనే ఉన్న మధుకైటభ రాక్షసుల చెవులకూ సోకింది. ఆ నాదానికి పరవశించిన అసురులు, తాము దొంగిలించిన వేదాలను ఒకచోట భద్రం చేసి... నాదం వినిపిస్తున్న దిక్కుకు పరుగులు తీశారు. ఇంతలో హయగ్రీవుడు, రాక్షసులు దాచిన వేదాలను తీసుకొని సముద్రగర్భం నుంచి బయటకు వచ్చాడు. హయగ్రీవ రూపాన్ని విడిచి స్వస్వరూపాన్ని ధరించాడు. మధు కైటభులు గానం వినిపించిన దిక్కుకు వెళ్లారు. ఎంత వెతికినా ఏమీ కన్పించలేదు. నిరుత్సాహంగా వేదాలను దాచిన చోటుకు తిరిగొచ్చారు. వారికక్కడ వేదాలు కన్పించలేదు. వెంటనే బయటకొచ్చిన ఆ రాక్షసులకు... సముద్రతలం మీద దివ్యతేజస్సుతో అలరారుతూ ఆదిశేషుడి పడగల నీడలో యోగనిద్రా ముద్రలో ఉన్న విష్ణువు దర్శనమిచ్చాడు. రసాతలంలో తాము దాచిన వేదాలను తీసుకువెళ్ళింది ఆయనేనని నిర్ణయించుకొన్నారు. స్వామి మీదకు యుద్ధానికి వెళ్ళారు. లోకకంటకులూ అధర్మవర్తనులూ అయిన ఆ ఇద్దరు దైత్యులను సంహరించాడు విష్ణువు. అలా వేదోద్ధరణ దిశగా హయగ్రీవ అవతరణం జరిగింది. అప్పుడే హయగ్రీవుడు వేదాధిపత్యాన్ని బ్రహ్మకు, సకల విద్యాధిపత్యాన్ని సరస్వతికి అప్పగించాడు. అందుకే హయగ్రీవ ఉపాసన చేసినా హయగ్రీవ జయంతి నాడు ఆ స్వామిని స్మరించినా జ్ఞానానందాలు కలుగుతాయని పెద్దలు చెబుతారు.

**ధర్మరక్షణ కోసం**

మహావిష్ణువు అవతారాలన్నీ ధర్మరక్షణ నేపథ్యంలోనే జరిగాయి. పూర్వం విచిత్రంగా హయగ్రీవుడు అనే పేరున ఓ రాక్షసుడు కూడా ఉండేవాడు. ఆదిపరాశక్తిని గురించి తపస్సు చేసి, తనకు మరణం లేకుండా వరం కోరుకొన్నాడు. అమ్మ అలా కుదరదంది. హయగ్రీవుడు కొంత తెలివిగా ఆలోచించి, గుర్రపు మెడతో ఉన్నవాడి వల్ల మాత్రమే తనకు మరణం సంభవించేలా వరం ఇమ్మన్నాడు. మనిషి శరీరానికి గుర్రపు మెడ ఉండే జీవి సృష్టిలో ఎక్కడా ఉండదని ఆ రాక్షసుడి నమ్మకం. ఇక అప్పటి నుంచీ హయగ్రీవ రాక్షసుడు సర్వలోకాలను వేధించసాగాడు. దేవతలంతా విష్ణువును శరణువేడారు. విష్ణుమూర్తి చాలాకాలం పాటు నిర్విరామంగా రాక్షస సంహారం చేసి అలసిపోయాడు. ఓ రోజున ఎక్కుపెట్టి ఉన్న ధనుస్సు మీదనే తల ఆనించి నిద్రకు ఉపక్రమించాడు. ఎన్నాళ్ళకూ నిద్ర నుంచి లేవకపోయే సరికి శివుడు దేవతలకు ఓ ఉపాయం చెప్పాడు. ఎక్కుపెట్టి ఉన్న ధనుస్సుకు బిగించిన అల్లెత్రాడును తెంపగలిగితే ఆ కదలికలకు విష్ణువుకు మెలకువ వస్తుందన్నాడు. ఆ తాడును కొరకగల శక్తి ఒక చెదపురుగుకు మాత్రమే ఉందని బ్రహ్మాది దేవతలకు అర్థమైంది. దానికే ఆ పని అప్పగించారు. చెదపురుగు తాడును కొరకటంతో ధనుస్సు కొన బలంగా విష్ణువు శిరస్సుకు తగిలింది. ఆ తల ఎగిరి ఎటో దూసుకువెళ్లింది. దాని కోసం అన్నిచోట్లా వెతికారు. అయినా ఫలితం లేకపోయింది. ఇక చేసేది లేక ఆదిపరాశక్తిని స్తుతించారు. ఆ అమ్మ ప్రత్యక్షమై... ఏదైనా గుర్రపు మెడను తెచ్చి విష్ణువు శరీరానికి అతికించమంది. దేవతలు శిరసావహించారు. అలా ... హయగ్రీవ స్వామి అవతరణ, రాక్షస సంహారమూ జరిగింది. దేవతలంతా ఆ స్వామిని వేద మంత్రాలతో స్తుతించారు. ఇది జరిగింది శ్రావణ పూర్ణిమనాడు. అప్పటి నుంచి హయగ్రీవ జయంతి జరుపుకోవటం ఆచారంగా వస్తోందని వ్రత గ్రంథాలు పేర్కొంటున్నాయి.

ఇక్కడ సామాజికంగా గమనించాల్సిన విషయం ఒకటుంది. అవయవ మార్పిడి ప్రస్తావన భారతీయ పురాణాల్లో ఏనాటి నుంచో కనిపిస్తోంది. తలకు బదులుగా తలను అమర్చే గొప్ప శస్త్రచికిత్సా విధానం ఇది. గణేశుడికి ఏనుగు తల, దక్షప్రజాపతికి మేక మెడ, హయగ్రీవ స్వామికి గుర్రపు మెడ... ఇవన్నీ అలనాటి శస్త్రచికిత్సా పరిజ్ఞానానికి సూచికలు. మన భారతీయ ఋషి విజ్ఞానతత్త్వానికి నిదర్శనాలు.

- శ్రీమల్లి, 73829 27069



# ‘శాకాహార’ చికెన్!

**చికెన్ బర్గర్ తెలుసు... మరి, పనస బర్గర్? మటన్ పిజ్జా తిన్నాం... మరి పనస పిజ్జా? ఆ పనస రుచులకు చాలా దేశాలు ఫిదా అయిపోతున్నాయి. మాంసపు రుచుల్ని గుర్తుకుతెచ్చే శుద్ధ శాకాహారంగా పనస పేరు తెచ్చుకుంటోంది.**



పనసపండును ఒలుస్తున్నా... ఆ సువాసన చుట్టుపక్కలంతా గుప్పుమనేస్తుంది. నిగనిగలాడుతున్న తొనలు ఎవరికైనా నోరూరిస్తాయి. పనస చెట్టు చాలా మొండిది. తక్కువ నీళ్లతో బతికేస్తుంది. అత్యధిక ఉష్ణోగ్రతనైనా తట్టుకుంటుంది. ముందొచ్చిన చెవుల కన్నా, వెనకొచ్చిన కొమ్ములే వాడి - అన్నట్టు, పండు కన్నా... కాయనే ఇప్పుడు ఎక్కువగా వాడుతున్నారు. ప్రపంచంలోని ప్రముఖ రెస్టారెంట్లలో కూడా పనసకాయ గురించే చర్చ. పనస కాయతో ఎన్ని రకాల వంటలు చేయవచ్చో చీఫ్ షెఫ్‌లంతా సీరియస్‌గా ప్రయోగాలు చేస్తున్నారు.

మాంసాహారులు ఎక్కువగా ఇష్టపడేది... చికెన్, మటన్. అది బర్గర్ కావచ్చు, పిజ్జా కావచ్చు, తందూరీ వంటకాలు అయినా కావచ్చు. అయితే, శాకాహారం విషయానికి వచ్చేసరికి రూపురేఖల్లో కానీ, రుచిలో కానీ మాంసానికి సాటివచ్చే మహారుచి ఏదీ లేదు. ఇప్పుడా స్థానాన్ని పనసకాయ భర్తీ చేస్తోంది. పనసతో వంటలు మనకు కొత్త కాకపోవచ్చు... కానీ, వంటకాల్లో మీట్‌కు బదులు పనసని వాడడం మాత్రం పూర్తిగా కొత్తే. వండిన తరువాత చూడ్డానికి అది అచ్చంగా మాంసాహారంలానే ఉంటుంది. ఆ ధైర్యంతోనే, మటన్‌తోనో చికెన్‌తోనో చేసే వంటకాలన్నీ పనసతోనే చేసేస్తున్నారు. దీంతో ఈ ఏడాది పనస వంటకాలు అంతర్జాతీయ పాకశాలల్లో సరికొత్త ట్రెండ్‌ని సృష్టించాయి. వెజిటేరియన్ ప్రియులు పనసతో చేసిన బర్గర్, పిజ్జా, టాకోస్, బావోస్, మంచూరియా... ఇలా అనేక వంటకాల ఫోటోలతో బ్లాగులను నింపేస్తున్నారు. పన్లో పనిగా కడుపూ నింపుకుంటున్నారు. అసలు మటన్‌తో చేసిన బర్గర్‌ని, పనసతో చేసిన బర్గర్‌ని పక్క పక్కన పెడితే ఏది మాంసాహారమో, ఏది కాదో తేల్చి చెప్పడం నలభీములకు కూడా సాధ్యం కాదు.

**ఏయే రెస్టారెంట్లలో...**

టేస్టీ జాక్ ఫ్రూట్ బిర్యానీని హైదరాబాద్‌లోని రెస్టారెంట్లూ అందిస్తున్నాయి. ముఖ్యంగా బార్బెక్యూలలో ఇవి పుష్కలంగా దొరుకుతున్నాయి. మాదాపూర్‌లో ఉన్న ‘అబ్సల్యూట్ బార్బెక్యూ’లో పనసకర్రీని తప్పక రుచి చూడాల్సిందే. మటన్, చికెన్ కర్రీలు కూడా ఆ రుచి ముందు తేలిపోవాల్సిందే. ముంబయిలోనూ పనస వంటలు అధికంగా దొరుకుతున్నాయి. ముంబయి ఎయిర్‌పోర్టులో ఉన్న హాలీడే ఇన్‌లో పనస కబాబ్స్ హాట్ కేకుల్లా అమ్ముడవుతున్నాయి. ‘పనస పొట్టు మసాలాలో బాగా కలిసిపోయి, మంచి రుచిని తెస్తుంది’ అంటారు సెవెన్ కిచెన్ షెఫ్ రోహన్ మాల్వంకర్ . రెస్టారెంట్లలో పనస బిర్యానీని కథల్ బిర్యానీ అంటారు. కథల్ కబాబ్స్, కథల్ కర్రీ... ఇలా పిలుస్తారు. కథల్ అంటే హిందీలో పనస పండు!

**క్యాలరీలూ తక్కువే...**

పనసలో పోషకాలకు కొదవేం లేదు. ఇందులో నీటి శాతం ఎక్కువ. ఫైబర్ పుష్కలం. రక్తపోటును అదుపులో ఉంచే పొటాషియం, కాల్షియం అధికం. అలాగే, విటమిన్-సి కూడా లభిస్తుంది. ముఖ్యంగా పనసపొట్టుతో చేసిన వంటకాలు ఎంత తిన్నా పెద్దగా కొవ్వు పట్టదు. మిగతా రుచులతో పోలిస్తే, క్యాలరీలు కూడా నామమాత్రం. కాబట్టి, బరువు పెరుగుతామన్న భయం లేకుండా పనసవంటల్ని లాగించేయచ్చు. మాంసాహారులకు... నిత్యం మీట్ తినడం వల్ల ఒంట్లో కొవ్వు చేరడం, బరువు పెరగడం వంటి సమస్యలు ఎదురువుతాయి. ఆ ఇబ్బందిలేకుండా పనస ముక్కల్ని నమిలేస్తూ చికెనానందాన్ని పొందవచ్చు. మటన్ మహదానుభూతిని సొంతం చేసుకోవచ్చు. పదపద... పనస విందుకు! ✻



# నువ్వే బెస్ట్... నీకో గిఫ్ట్!




స్నేహితుల దినోత్సవం... ఈ మాట వినగానే ఎదలోతులో... ఏ మూలనో... నిద్రపోతున్న జ్ఞాపకాలు... ఉలిక్కిపడి నిదురలేస్తున్నాయా? లేవనీయండి. కాసేపు గతంలో విహరించనీయండి. వీధి చివర ఆటల నుంచి ప్రారంభమై... స్కూలు, కాలేజీ... ఇలా ప్రతి మజిలీలో కలిసిన ఎంతో మంది స్నేహితులు మదిలో మెదులుతారు. అందులో కొందరు, నీడలా... మీ వెంటే నడుస్తుంటారు. ఆ కొద్దిమందీ లేకపోతే... జీవితం శూన్యంలా అనిపిస్తుంది. వాళ్లే... ప్రాణ స్నేహితులు. 'స్నేహితుల దినోత్సవాన' వారికో బహుమతి ఇస్తే... స్నేహానికి తీపి గుర్తుగా మిగిలిపోతుంది. '...అయితే ఏం ఇవ్వాలి' అంటారా? ఈ గిఫ్ట్ ఐడియాలు మీకోసమే..

## మెరిసే బాటిల్ ల్యాంప్




బెడ్‌లైట్‌లా ఉపయోగపడే బాటిల్ ల్యాంప్‌లు ఇప్పుడు బహుమతులుగానూ మారాయి. బాటిల్‌పై మీ స్నేహాన్ని సూచించే ఫోటోను అచ్చువేయిస్తే... మధుర జ్ఞాపకంగా మిగిలిపోతుంది. ఆ దీపం వెలుగులో బాటిల్‌మీద మీ స్నేహచిత్రం ధగ ధగా వెలిగిపోతూ కనిపిస్తుంది. ఫోటోకు బదులుగా ఏదైనా మెసేజ్ కూడా రాయచ్చు. ఆన్‌లైన్‌లో ఇవి విరివిగా దొరుకుతున్నాయి.

## ఓ మందార మొక్క...





మొక్కలు ఇప్పుడు తిరుగులేని బహుమతులు. అలాగని ఏ మొక్క పడితే ఆ మొక్క ఇవ్వమని కాదు. మందార మొక్క... అదీ పూలతో ఉన్నది బహుమతిగా అందించడం కొత్త ట్రెండ్. పెద్ద మొక్కలు కాకుండా... నర్సరీల్లో లేదా ఆన్‌లైన్‌లో కూడా పూలతో నిండిన చిన్న మందార మొక్కలను ప్రత్యేకంగా అమ్ముతున్నారు. అలాగే లక్కీ బాంబూ (వెదురు)మొక్కని కూడా ఇవ్వొచ్చు.

## స్లీపింగ్ బుద్ధా



బుద్ధుడు శయనిస్తున్న విగ్రహం ఇంట్లో ఉంటే... భోగభాగ్యాలు వెల్లివిరుస్తాయని కొన్ని దేశాల్లో నమ్ముతారు. అలాగే శాంతికి చిహ్నంగాను భావిస్తారు. కాబట్టే, స్లీపింగ్ బుద్ధా బహుమతుల రేసులో ముందుంది ఇప్పుడు. ప్రతి దానికి టెన్షన్ పడిపోయే స్నేహితుడికి దీన్ని ఇస్తే మరీ బాగుంటుంది. అన్నట్టు, బ్యాంకాక్‌లో అతి పెద్ద స్లీపింగ్ బుద్ధా ఆలయం ఉంది.



## చాక్లెట్ బొకే

ప్రేమికుల రోజైనా, పెళ్లి రోజైనా, పుట్టిన రోజైనా శుభాకాంక్షలు చెప్పేందుకు చేతిలో పూల బొకేతో ప్రత్యక్షమైపోతాం. స్నేహితుల దినోత్సవానికి కూడా మళ్లీ పూలేనా? అంటారా. లేదండీ, కొత్తగా చాక్లెట్ బొకేలూ, టెడ్డీ బేర్ బొకేలూ వచ్చాయి. పూల స్థానంలో... చాక్లెట్లు, చిన్న టెడ్డీ బేర్ బొమ్మలూ అమర్చి బొకేల్ని తయారుచేస్తారు. 'మంచింగ్ మిక్స్ బొకే'లు కూడా ఉన్నాయి. అందులో చాక్లెట్లు, లాలీపాప్‌లు, కుర్‌కురే, లేస్ వంటి చిప్స్ ప్యాకెట్లు కూడా పెట్టి సిద్ధం చేస్తారు. మీ స్నేహితులలో రుచుల ప్రియులు కనుక ఉంటే... వారికి ఈ మంచింగ్ మిక్స్ బొకే తప్పక నచ్చుతుంది.

## ఫొటో పత్రో గ్రీటింగ్స్

స్నేహితులతో ఎన్నో అనుభూతులు పంచుకుని ఉంటారు. సినిమాలూ షికార్లూ విహారయాత్రలూ షరా మామూలే. ఫోటోలు, వీడియోల గురించి చెప్పక్కర్లేదు. అవన్నీ ఫ్రేము ఫ్రేములో నవ్వులు పూస్తాయి. అందులోంచి మీకు నచ్చిన ఫోటోని గ్రీటింగ్‌గా మార్చిస్తే బాగుంటుంది. 'ఎలా మార్చాలి' అంటారా? అందుకు ఆన్‌లైన్‌లో అనేక సంస్థలున్నాయి. మీ ఫోటో పంపించి ఆర్డరిస్తే ఎంచక్కా గ్రీటింగు కార్డుని మీ అడ్రసుకు పంపేస్తారు. లేదంటే ఇ-గ్రీటింగ్‌కార్డును మీరే తయారుచేసి... స్నేహితునికి మెయిల్ చేసి శుభాకాంక్షలు చెప్పొచ్చు.




## ఫ్రెండ్‌షిప్ వాచ్

స్నేహితుల దినోత్సవాన సందడి చేసేది ఫ్రెండ్‌షిప్ బ్యాండ్‌లే. అందరి మణికట్టుకూ అవే కనిపిస్తాయి. మీ మనసుకు దగ్గరైన బెస్టీకి కూడా అవేనా? 'వెరీ వెరీ స్పెషల్' ఫ్రెండ్స్ కోసం 'ఫ్రెండ్‌షిప్ బ్యాండ్ వాచ్' వచ్చేసింది. ధర కూడా ఎక్కువేం కాదు. రెండొందల యాభై రూపాయల నుంచీ మార్కెట్లో దొరుకుతున్నాయి. అమ్మాయిలకి, అబ్బాయిలకి వేరువేరుగా కూడా ఉన్నాయి. అమ్మాయిల ఫ్రెండ్‌షిప్ బ్యాండ్ వాచీలు మరింత అందంగా, ట్రెండీగా ఉన్నాయి. కావాలనుకుంటే ఖరీదైన డయల్ కొని దానికి బ్యాండ్‌ను ఎటాచ్ చేయచ్చు.



## 'స్నేహం' క్విజ్

**1. మీకు ఎంతమంది బెస్ట్ ఫ్రెండ్స్?**
ఎ. ఆరుగురి దాకా.
బి. ముగ్గురు. సి. చాలామంది ఉన్నారు.

**2. బెస్ట్ ఫ్రెండ్స్‌ని ఎంత తరచుగా కలుస్తారు?**
ఎ. వారానికోసారి. బి. దాదాపు రోజూ.
సి. ఏడాదికో ఆర్నెల్లకో.

**3. స్నేహితుడితో గొడవ పడితే..**
ఎ. కాసేపు బాధపడతా. బి. వాదన వాదనే, స్నేహం స్నేహమే. సి. అవును... నేను నా వాదనకే కట్టుబడి ఉంటా.

**4. స్నేహితులతో ఎంజాయ్ చేసేందుకు పార్టీ ఏర్పాటు చేశారు. చివరి నిమిషంలో మీ బెస్ట్ ఫ్రెండ్ ఫోన్ చేసి... తన కష్టాలన్నీ చెప్పుకొచ్చాడు. అప్పుడు మీరేం చేస్తారు?**
ఎ. పార్టీకి వెళ్లడానికి ముందు కాసేపు ఫ్రెండ్‌తో మాట్లాడతా.
బి. పార్టీని పక్కన పెట్టి స్నేహితునితో ఉంటా.
సి. మరుసటి రోజు కలుస్తానని చెప్పి పార్టీకి వెళ్తా.

**5. మీ అభిప్రాయాన్ని బెస్ట్ ఫ్రెండ్ అంగీకరించకపోతే?**
ఎ. అతనిపై జోకులు వేస్తాను.
బి. ఆ అభిప్రాయాన్ని గౌరవిస్తాను. తన దృష్టికోణం నుంచి ఆలోచిస్తాను.
సి. అతని అభిప్రాయం ఏదైనా పట్టించుకోను.

**ఎక్కువ జవాబులు 'ఎ' అయితే...**
మీరు స్నేహితుల పట్ల చాలా కేరింగ్‌గా ఉంటారు. అయితే ఫ్రెండ్‌కి, బెస్ట్ ఫ్రెండ్స్‌కి మధ్య తేడాను తెలుసుకోవాల్సిన అవసరం ఉంది.

**ఎక్కువ జవాబులు 'బి' అయితే...**
మీ చుట్టూ స్నేహితుల గుంపు ఉంటుంది. అయితే వాళ్లలో ఎక్కువ మంది పాతవారే. కొత్త స్నేహాలు త్వరగా చేసుకోరు. స్నేహాన్ని ఎలా కాపాడుకోవాలో మరింతగా అర్థం చేసుకోవాలి.

**ఎక్కువ జవాబులు 'సి' అయితే...**
మీరు మంచి స్నేహితులే కానీ... బెస్ట్ ఫ్రెండ్‌ని కూడా నేరుగా కలవరు. ఆన్‌లైన్‌కే పరిమితం అవుతారు. కాబట్టి మీరంటే ఇష్టం చూపే వ్యక్తులను తరచూ ప్రత్యక్షంగా కలవండి.




**అవి కసకసలాడుతూంటే ఆగలేక లాక్కున్నారు కుట్టీ, గణేశన్‌లు.**

**"తలా వొొకట్రోయ్" అన్నాడు బీడీ కాలుస్తూ జేబరాజ్.**

**జేబరాజ్‌కొకటి ఇచ్చేసి, చెరొకటి దాచుకున్నారు కుట్టీ, గణేశన్‌లు.**

**బీడీ పొగ ఊదుతూ, "వణికిపోవాల్రా స్టేటు!" అని ఆర్డరేశాడు జేబరాజ్.**

**"ఆ స్టేటు? ఆ స్టేటు వద్దా?' గునిశాడు కుట్టి.**

**"వణికి సచ్చుద్దిరా అది కూడా మన యాటకి!" భరోసా ఇచ్చాడు గణేశన్.**

మూత విప్పుతూ, "అన్నా, తర్వాత?" అడిగాడు కుట్టి.

"ఏవుంది, ఎవరికి వారే యమునా తీరే!" అని ముంతలో పోసిన సారాని ఆబగా జుర్రుకో సాగాడు జేబరాజ్.

● ● ●

మద్రాస్... 1986. కూతురున్న గదిలో కెళ్ళి ఇంద్రకుమారి, "ఇంకెన్నాళ్ళే ఈ అద్దె మహల్లో షోకులూ... సొంత బిల్డింగే ఉండదా మనకీ?" అని విసుక్కుంది.

"ఈ అన్నానగర్‌లో పుట్టాక అన్నానగర్లో సొంత బంగళా ఉండదా?... రానీ పూర్తిగా ఎమౌంటు! ఒకటొకటే వస్తాయ్ అన్నీ!" అని ముస్తాబవసాగిందామె గబగబా.

"ఈ కొంపలో తెల్లారనీయకమ్మా నీ గ్రామరు మాత్రం!"

"అదిగో మళ్ళా! అవసరమా ఎబిసిడిలు? గ్రామరట- వచ్చింది పెద్ద!"

బయటకొచ్చి కారెక్కింది. డోర్ వేసి పోనిచ్చాడు డ్రైవర్ జేబరాజ్. కిచెన్‌లో వంట చేస్తూ బిజీగా వున్నాడు గణేశన్.

గేటు దగ్గర సెల్యూట్ కొట్టి కారుకి దారిచ్చాడు వాచ్‌మన్ కుట్టి.

● ● ●

గ్లాసుల్లో ద్రవాల గుడగుడలు, కంచాల్లో చెంచాల గీకుళ్ళు, పళ్ళకింద పసపస నములుళ్ళు, మత్తెక్కిన ముద్దముద్ద మాటలు. 'చూద్దాంలే' అని పీకలదాకా ఒక గొంతు, 'ఇప్పుడే చూడాల'ని నషాళందాకా ఇంకో గొంతు. గొంతులు... గ్లాసులు... చెంచాలు... గందరగోళం.

"సేసిందిగా మలయాళంలో నలభై...ఆc?...ఇంకేంటీ? ఇయ్యాల్లొచ్చేసి తమిళమా తమిళం? మలయాళం కాడ్నే గౌరవంగా ఉండొద్దా? అందికే, ఇక్కడ అడుక్కుంటా తిరగొద్దని సెప్పెహె నోర్మూసుకుని..." పెద్ద గొంతు పెద్ద కేకలెయ్యడంతో నిశ్శబ్దమైపోయింది మూసిన గది.

కేరళలో 'కరినగం' ఇంకా కలెక్షన్లు వచ్చే సూచనల్లేవు. ఇప్పటికే మూడు నెలలైంది విడుదలై. ఇప్పుడున్న తాజా షూటింగులు 'వంబం', 'బీకరం'లకి సంబంధించి... ఎప్పుడో మూడేళ్ళ క్రితం రెండు తమిళ సినిమాల తర్వాత ఆఫర్స్ లేవు. మలయాళంలో 43కి చేరాయి. పుట్టి పెరిగిన తమిళంలో దూసుకెళ్ళాలని ఆశ...

ఇల్లు కూడా కొనుక్కోవాలని కోరిక రాణీ పద్మినికి...

● ● ●

ఆ బంగళాలోంచి కారెక్కించుకుని బయల్దేరాడు డ్రైవర్ జేబరాజ్. ఇటీవలే డ్రైవర్, కుక్, వాచ్‌మన్ కావాలని ఆమె పేపర్లో ప్రకటన వేయిస్తే వచ్చి కుదిరాడు. కుట్టీ, గణేశన్‌లు కూడా ఇలాగే కుదిరారు. ముగ్గురూ ఫ్రెండ్స్ అయిపోయారు.

"వీరోయిన్ దగ్గర మనం కుదిరామా, వీరోయినేమో కేరళ నుంచొచ్చి కుదిరింది. కొత్త ఊళ్ళో పాత మేళం మనమే చూసుకోవాల" అనుకున్నారు కాన్ఫిడెంట్‌గా. కానీ హద్దులు చూపిస్తోంది ఇంద్రకుమారి, దగ్గరయ్యే ప్రయత్నం చేస్తూంటే.

ఇప్పుడు పద్మినిని ఇంటికి చేర్చాక, అవుట్‌హౌస్‌లో కెళ్ళాడు జేబరాజ్. ఇవ్వాళ ఆమె పనై నట్టుందని చెప్పాడు. ఏంటి నమ్మకమని కుట్టీ, గణేశన్‌లు అడిగారు. పనై ఉంటుందని ఊహించుకుని రిస్కు తీసుకోలేమన్నారు.

"మరి? ఫోటోలు తీయాలనా ఫోటోలు? మీట నొక్కి చకచక మెరుపులు మెరిపించి? అనక అడ్డంగా దొరికిపోయి లాకప్‌లో వారి దేవుడా వారి దేవుడా అని కూకలేస్తూ?"

"జేబ్రాజన్నా! ఫోటోలైతే మాంచిగ పింఛన్‌కి మల్లే నోట్లు వొస్తూంటాయిగా అడిగినప్పుడల్లా ఈ పాడు జీవితమంతా, ఆలోచించన్నా!"

ఆ రాత్రి పద్మిని నిద్రపోతున్న బెడ్‌రూం కేసే చూస్తూ అవుట్‌హౌస్ బయట కూర్చున్నారు. బీడీలూ సారా సఫా చేశారు. అప్పుడు జేబరాజ్ తేల్చి చెప్పాడు, అనుకున్న రిస్కే తీసుకుంటున్నామని.

● ● ●

ఉదయమే లేచి పనులు చూసుకుంటోంది ఇంద్రకుమారి. రాణీ పద్మిని స్నానం చేస్తోంది. గణేశన్ కాఫీ కాస్తున్నాడు. గేటు దగ్గర కుట్టి లేడు. అవుట్‌హౌస్‌లో జేబరాజ్ లేడు.

నిశ్శబ్దంగా వుంది ఇల్లు. ఇంట్లోకి జేబరాజ్, కుట్టీలు వచ్చేస్తూంటే, "ఎందుకొచ్చారు లోపలికి? బయటికి ? బయటికి..." అని కాలు అడ్డంపెట్టింది ఇంద్రకుమారి.

"జరగవమ్మా పెద్దమ్మా, ఇల్లు కొంటున్నారటగా? మీ మాటలు విన్నా..." నెట్టుకుంటూ జేబరాజ్ లోపలికొచ్చేస్తుంటే, తిరగబడి ఒక్కటి పీకింది- "ఏంట్రా నీ దౌర్జన్యం? ఏంట్రా ఇదీ!"

కసకసలాడుతున్న సరికొత్త కత్తి తళుక్కున మెరిసింది జేబరాజ్ చేతిలో- అది చూసి తనూ తీశాడు కసకసలాడుతున్న కత్తిని కుట్టి. గాభరా పడిపోయింది ఇంద్రకుమారి- "ఇల్లు కొంటారా? ఇల్లు కావాలా? రా నేనిప్పిస్తా!" అని ఒక్కపోటు పొడిచాడు జేబరాజ్. వెనకనుంచి కుట్టి ఇంకో పోటు పొడిచాడు. విలవిలలాడుతూ ఆర్తనాదాలు పెట్టింది. కసకసలాడుతున్న కత్తితో తనూ వచ్చి పడ్డాడు గణేశన్. ముగ్గురి చేతుల్లో కత్తిపోట్లకి ఆమె వేస్తున్న కేకలకి, స్నానం చేస్తున్న పద్మిని ఉన్నపళాన వచ్చేసి స్థాణువయ్యింది.

"వీరోయినూ... ఇల్లు కావాలా? దీన్ని చూసుకోండ్రా!" అని అరిచి బెడ్రూంలోకి పరుగెత్తాడు జేబరాజ్. అటు ఇంద్రకుమారి నిశ్శబ్దమైపోయింది గానీ, రాణీపద్మిని చేస్తున్న ఆర్తనాదాలు మిన్నంటుతున్నాయి. పని పూర్తి చేసుకుని గణేశన్, కుట్టీలు చల్లగా వచ్చేసరికి - బీరువాలోంచి నోట్ల కట్టలు తీస్తున్నాడు జేబరాజ్.

"చెప్పలే? రిస్కు తీసుకుంటేనే లాభం! నిన్న డబ్బు తెచ్చి పెట్టుకుంది ఇల్లు కొంటానికని నాకు తెల్సు!"

నమ్మలేకుండా చూస్తున్నారు గణేశన్, కుట్టీలు... ఆ 15 లక్షల నగదు, నగలూ నట్రా ఊడ్చేసి వాళ్ళు పరారవుతూంటే-

చెరో మూల రక్తపు మడుగుల్లో పడున్నారు తల్లీ కూతుళ్ళు.

సుప్రీంకోర్టు దాకావెళ్ళి, వాళ్ళకి యావజ్జీవ శిక్షలు ఖరారు కావడానికి, ఒక పదిహేనేళ్ళ పూర్తి కాలమంతా వేచి ఉండాలని కన్నుమూసిన ఆ తల్లీకూతుళ్ళకి తెలీదు.

**- సికిందర్**





**డా. శ్రీకాంత్ మోర్లావర్**
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో సిస్టమిక్ లూపస్ ఎరితిమాటోసిస్ (SLE) సమస్యకు సరైన పరిష్కారం

సిస్టమిక్ లూపస్ ఎరితిమాటోసిస్ (SLE) ఒక ఆటో ఇమ్యూన్ వ్యాధి. సాధారణంగా శరీరంలోకి ఏవైనా అన్యపదార్థములు ప్రవేశించినప్పుడు మన శరీర రోగనిరోధక వ్యవస్థ వాటిని గుర్తించి, వాటికి వ్యతిరేకంగా యాంటీబాడీస్‌ను ఉత్పత్తి చేయడం ద్వారా వాటిని నశింపజేసి - ఇన్‌ఫెక్షన్స్ బారిన పడకుండా మనల్ని కాపాడటం జరుగుతుంది. కానీ మన శరీరంలోని కొన్ని అసమతుల్యతల కారణంగా ఈ రోగనిరోధక వ్యవస్థ పొరబడి సొంత కణాలపై దాడి చేయడం వలన కలిగే వ్యాధులనే 'ఆటో ఇమ్యూన్ వ్యాధులు' అని అంటారు.

ఈ SLE వ్యాధి ప్రభావం చర్మంపై పడటంతో పాటు, కీళ్ళు, మూత్రపిండాలు, మెదడు మొదలగు ఇతర అవయవాలపై ఉంటుంది.

ఏ వయస్సు వారినైనా ఈ వ్యాధి ప్రభావితం చేస్తుంది. ముఖ్యంగా 10 నుండి 50 సం॥ మధ్య వయస్సు గల వారిలో ఇది ఎక్కువగా కనిపిస్తుంది. పురుషుల కంటే స్త్రీలలో 10 రెట్లు అధికంగా ఈ సమస్య కనిపిస్తుంది. ఇది ఒక దీర్ఘకాలిక ఆరోగ్య సమస్య.

**Systemic Lupus Erythematosus (SLE)**



## Systemic Lupus Erythematosus (SLE):

**కారణాలు:** SLE వ్యాధికి గల ఖచ్చితమైన కారణాలు తెలియరాలేదు. కానీ కొన్ని జన్యుపరమైన అంశాలు, వాతావరణ రీత్యా కొన్ని కారణాలు - ముఖ్యంగా అల్ట్రా వైలెట్ కిరణాలు, కొన్ని రకాల మందులు, వివిధ వైరస్‌లు, మానసిక మరియు శారీరక ఒత్తిడి మరియు గాయాల వలన ఈ వ్యాధి ప్రేరేపించబడేదిగా ఉంటుందని అనుభవపూర్వకంగా తెలుస్తోంది. • SLE పురుషుల కంటే స్త్రీలలో ఎక్కువగా కనిపిస్తుంది. స్త్రీలలో ఈ వ్యాధి లక్షణాలు గర్భధారణ సమయంలో మరియు నెలసరి సమయంలో ఎక్కువ అవుతూ ఉంటాయి. ఈ కారణంగా Oestrogen హార్మోన్ - SLE వ్యాధి కలగడానికి ఒక కారణంగా భావించడం జరుగుతోంది.

**లక్షణాలు:** SLE వ్యాధి లక్షణాలు కొన్ని రోజులు ఎక్కువగాను, మరికొన్ని రోజులు తక్కువగాను ఉంటాయి. ఈ వ్యాధికి గురి అయిన అవయవాన్ని బట్టి ఆయా లక్షణాలు కనిపిస్తాయి. • మెదడు మరియు నాడీ వ్యవస్థ: ఇవి రెండూ గనక ఈ వ్యాధి బారిన పడితే మానసిక అశాంతి, పక్షవాతం, మూర్ఛ వ్యాధి, తలనొప్పి, మొద్దుబారడం, తిమ్మిర్లు, కంటిచూపు సమస్యలు ఏర్పడతాయి. • గుండె: ఈ SLE వ్యాధి కారణంగా గుండెలో-పెరికార్డయిటిస్, మయోకార్డయిటిస్ మరియు ఎండోకార్డయిటిస్ సమస్యలు ఏర్పడటం వలన ఆయాసం, నీరసం మొ॥ లక్షణాలు కనిపిస్తాయి.

• రక్తనాళాలు: ఈ వ్యాధి బాధితుల రక్తనాళాలలో కొవ్వు పేరుకుపోయి గుండెనొప్పి వచ్చే అవకాశం ఉంటుంది. • జీర్ణకోశ ప్రాంతము: కడుపునొప్పి, వికారం వంటి లక్షణాలతో పాటు వాంతులు కలుగుతాయి. • ఊపిరితిత్తులు: ఈ వ్యాధి బారిన పడితే శ్వాస తీసుకోవడంలో ఇబ్బంది ఏర్పడుతుంది మరియు రక్తంతో కూడిన దగ్గు, ఊపిరితిత్తులలో నిమ్ము చేరటం వంటి లక్షణాలు ఏర్పడతాయి.

• మూత్రపిండాలు: ఈ వ్యాధి వలన మూత్రపిండాలు శోథమునకు గురి అయితే, మూత్రం ద్వారా ప్రొటీన్లు మరియు రక్తకణాలు కోల్పోయి శరీరమంతా వాపులు మరియు బరువు పెరగడం వంటి లక్షణాలను గమనించవచ్చు. • చర్మం: SLE వ్యాధి ప్రభావం చర్మంపై పడటం వలన ఎర్రని దద్దుర్లు ఏర్పడి, పొరలుగా మరియు దళసరిగా మారి, చర్మంపై నల్లటి మచ్చలు ఏర్పడతాయి. ముఖంలో బుగ్గలు మరియు ముక్కు పైన సీతాకోకచిలుక ఆకారంలో దద్దుర్లు ఏర్పడతాయి.

• గర్భిణీలలో: గర్భంతో ఉన్నవారు ఈ వ్యాధి బారిన పడటం వలన - పిండ మరణం, గర్భస్రావం జరిగే అవకాశం అధికంగా ఉంటుంది. • తీవ్రమైన అలసట, కీళ్ళలో నొప్పి, ముఖ్యంగా చిన్న కీళ్ళలో నొప్పి మరియు వాపు, వెంట్రుకలు రాలిపోవడం, రక్తహీనత, రక్తం గడ్డకట్టడంలో సమస్యలు, జ్వరం, లింఫ్ గ్రంథుల వాపు వంటి లక్షణాలను గమనించవచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** CBP, ESR, CUE, రుమటాయిడ్ ఫ్యాక్టర్, యాంటీ న్యూక్లియర్ యాంటీబాడీస్ (ANA), సీరం క్రియేటినైన్, లివర్ మరియు కిడ్నీ ఫంక్షన్ టెస్ట్‌ల ద్వారా SLE వ్యాధిని నిర్ధారించుకోవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** సాధారణంగా SLE వ్యాధికి అనేక చికిత్సా పద్ధతులు ఉన్నప్పటికీ ఏ పద్ధతిలోనూ సంపూర్ణంగా నయం చేసే అవకాశం లేదు. కేవలం 'హోమియోపతి' మందులను వాడటం ద్వారా - ఎటువంటి అసౌకర్యం, దుష్ఫలితాలు లేని చికిత్స చేయవచ్చు. 'హోమియోకేర్ ఇంటర్‌నేషనల్'లో మాత్రమే అందించబడే జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ చికిత్సా విధానంలో అధునాతనమైన హోమియోవైద్య నిపుణులైన వారి ద్వారా SLE వ్యాధిని పూర్తిగా అదుపులో ఉంచడమే కాకుండా ఎటువంటి దుష్ఫలితాలు లేకుండా సంపూర్ణంగా నయం చేయవచ్చు.




**హోమియోకేర్® ఇంటర్‌నేషనల్**
వరల్డ్-క్లాస్ హోమియోపతి

టోల్ ఫ్రీ **1800 108 1212**

కన్సల్టేషన్ ఉచితం **955 000 1199**

www.homeocare.in

Advt

# పల్లెకు పోదాం...

**ఎవరో బిగ్గరగా అరవడం వినిపించి ఉలిక్కిపడి కళ్లు తెరిచాను. ఏం జరుగుతుందో, ఎక్కడున్నానో ఒక్క క్షణం అర్థం కాలేదు. మా అంబులెన్స్ డ్రైవర్ మోహన్ ఎవరి మీదో అరుస్తున్నట్టున్నాడు. తను అంబులెన్స్‌లో లేడు. బయటకు చూశాను. కంకిపాడు సెంటర్‌లో అంబులెన్స్ ఆగి ఉంది. అప్పుడు గుర్తుకొచ్చింది. మా హాస్పిటల్ మేనేజింగ్ డైరెక్టర్ డాక్టర్ వెంకట్ తెల్లవారు జామునే నిద్రలేపి, అర్జెంట్‌గా చల్లపల్లి వెళ్లి, అక్కడ ఓ హాస్పిటల్లో ట్రీట్‌మెంట్ తీసుకుంటున్న ఎనిమిదేళ్ల పాపను పరీక్షించి, అవసరమైతే తమ హాస్పటల్‌కి తీసుకురమ్మని చెప్పాడు.**



**డాక్టర్ ఎస్సెస్కే**

**ముం**దురోజు చాపపై నిద్రిస్తున్న పాపను పాము కాటేసిందట. వెంటనే చల్లపల్లిలోని ఓ హాస్పిటల్‌కు తీసికెళ్లారు. అక్కడే పాపకు వైద్యం అందిస్తున్నారు. రెండు రోజులు గడిస్తేగానీ పాపకు ప్రాణాపాయం ఉందో, లేదో చెప్పలేమని అక్కడి డాక్టర్స్ చెప్పారట. ఆ ఏరియా ఎంపీగారు వెంకట్ నాన్నగారికి మిత్రుడు. ఆయన ఫోన్ మీద ఫోన్ చేసి వీడి ప్రాణాలు తోడేస్తున్నారు. పాపను తీసికెళ్లి ట్రీట్‌మెంట్ ఇవ్వమని.

• • •

నేనూ, వెంకట్ చిన్ననాటి స్నేహితులం. స్కూలు రోజుల నుంచి ఒకే క్లాస్. క్రికెట్ టీంలో కలిసి ఆడేవాళ్లం. నేను మెరిట్‌తో మెడికల్ సీటు తెచ్చుకుని ఎంబీబీఎస్ పూర్తి చేసి చివరకు పిల్లల వ్యాధుల్లో ఎండీ సీటు సంపాదించాను. వెంకట్ నాన్న వాడికి మెడిసిన్, ఆ తరువాత ఉన్న డిగ్రీలన్నీ డబ్బుతో కొని, ఓ హాస్పిటల్ కట్టించి, దానికి మేనేజింగ్ డైరెక్టర్‌ను చేశారు. నేను ఎండీ పూర్తయిన తరువాత అనుభవం కోసం వాడి హాస్పిటల్లో పిల్లల వ్యాధుల విభాగంలో చేరాను.

నేనంటే వెంకట్‌కు నమ్మకం. నా మీద పెత్తనం చెయ్యడు గానీ, ఏమైనా హాస్పిటల్ వాడిదేగదా!

ఆ పాప గురించి వాడు చెప్పినప్పుడు "నేనెప్పుడూ పాము కాటు కేసులు చూడలేదు. ఎలా మేనేజ్ చేయగలను?" అన్నాను.

"పరవాలేదు. ఇంటర్‌నెట్‌లో చూడు. మన దగ్గరకొచ్చిన తరువాత ఎలాగోలా మేనేజ్ చేద్దాం" అన్నాడు.

అంబులెన్స్ వచ్చే లోపు ఇంటర్నెట్‌లో ప్రపంచ ఆరోగ్య సంస్థ గైడ్‌లైన్స్ చూశాను. దాదాపు వంద పేజీల సమాచారం. పైపైన చదివాను. ట్రీట్‌మెంట్ వరకు యాంటీ స్నేక్ వ్యాక్సిన్ ఇవ్వాలని ఉంది. ఎంత ఇవ్వాలి? ఎప్పుడు ఇవ్వాలి? అనేదానిపై పూర్తి అవగాహన రాలేదు.

నేను ఎండీ చదివిన యూనివర్సిటీలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గారికి ఫోన్ చేసి అడిగాను. ఆయన కూడా ఈ విషయంలో ఎక్కువ నాలెడ్జ్ లేదన్నారు. ఇంతలో అంబులెన్స్ వచ్చింది. దానిలో కూర్చోగానే నిద్రలోకి జారిపోయాను.

• • •

మోహన్ గొణుక్కుంటూ వచ్చి ఇంజన్ స్టార్ట్ చేశాడు.

"ఏమిటి కేకలు వేస్తున్నావ్?" అడిగాను.

"ఏం లేదు సార్. దాహంగా అనిపిస్తే, మా స్నేహితుడి దగ్గర కొబ్బరిబొండాం తాగుతున్నాను. వాడు పక్కనే చెరకు మిషన్ పెట్టుకుని ఉన్న ఆయనకు, నన్ను విజయవాడలో పెద్ద కార్పొరేట్ హాస్పిటల్లో అంబులెన్స్ డ్రైవర్‌నని పరిచయం చేశాడు. అతను నాదీ మీదీ ఒకటే బిజినెస్ అన్నాడు. అదెట్లా అని అడిగాను. నేను చెరకు గడలను పిండుతాను. మీరు రోగులను పిండుతున్నారని అన్నాడు. నాకు కోపం వచ్చి అరిచాను."

అతడు అన్నదానిలో అతిశయోక్తి లేదనిపించింది.

"ఇంకా ఎంత టైం పడుతుంది?" అడిగాను.

"ఇంకెంత సార్! గంటలో వెళ్లిపోతాం".

"మాదీ చల్లపల్లే సార్. మనం వెళ్లే హాస్పిటల్‌కు మంచి పేరుంది. డాక్టర్లిద్దరూ మంచివాళ్లు. డబ్బు గుంజే టైపు కాదు. ఆయన జనరల్ ప్రాక్టీస్ చేస్తారు. ఆమె కాన్పులు, ఆపరేషన్‌లు చేస్తారు. ఆ ప్రాంతంలో పాముకాటు కేసులన్నిటికీ ఆయనే వైద్యం చేస్తారు. సరైన సమయానికి తీసికెళితే తప్పనిసరిగా బతికిస్తారు."

"మరి మనమెందుకయ్యా ఇప్పుడెళుతున్నాం!" అడిగాను.

"సార్, ఎండీగారు వెళ్లమన్నారు. ఇదంతా నేను ఆయనకు చెప్పలేను కదా."

"ఆయన పేరేమిటి?"

"రామకృష్ణ. భార్య పేరు విజయ. ఆయనకు 50 ఏళ్లు ఉంటాయి. 20 ఏళ్ల నుంచి అక్కడే ప్రాక్టీసు చేస్తున్నారు".

అంత అనుభవమున్న డాక్టర్‌గారి దగ్గర నుంచి పేషెంట్‌ను షిఫ్ట్ చేసి, నాకు తెలియని కండిషన్‌ను ట్రీట్ చేయడం దుస్సాహసం అనిపించింది.

హైదరాబాద్‌లో ఓ పెద్ద హాస్పిటల్ ఎమర్జెన్సీ విభాగంలో ఉన్న నా మిత్రుడికి ఫోన్ చేసి విషయం చెప్పాను. వాళ్ల చీఫ్‌తో నాకు ఫోన్ చేయిస్తానన్నాడు. ఐదు నిమిషాల్లో నా ఫోన్ మోగింది. డాక్టర్ కిషోర్ మాట్లాడారు.



పరిస్థితి ఆయనకు వివరించాను. ఆయన పెద్దగా నవ్వి, "డాక్టర్ రమేష్, మేము కాంక్రీట్ జంగిల్‌లో ఉన్నాం. ఇక్కడి పాములన్నీ ఎప్పుడో చనిపోయాయి. పాము విషం కంటే ప్రమాదకరమైన మనుషులు మాత్రం ఉన్నారు. అందుకని నాకు కూడా పాము కాటు ట్రీట్‌మెంట్ గురించి అంతగా తెలియదు. తెలుసుకోవాల్సిన అవసరం రాలేదు. కానీ ఆ మధ్య ఓ మెడికల్ కాన్ఫరెన్స్‌లో ఒక డాక్టర్ ప్రజెంటేషన్ విన్నాను. చాలా వర్క్ చేశాడు. మీ ఏరియానే .. చల్లపల్లి అని గుర్తు" అన్నారు.

ఆయనకు థాంక్స్ చెప్పి ఫోన్ కట్ చేశాను.

అంబులెన్స్ గతుకుల రోడ్లో నెమ్మదిగా వెళుతోంది.

వెనక సీట్లో ఉన్న మా కాంపౌండర్ రాము "సార్ మా ఊళ్లో మంత్రగాడు నోట్లో పసరు పోసి, కంట్లో కలికం వేసి, చెవిలో ఏదో మంత్రం చెబుతాడు. వెంటనే పాము కరిచిన వ్యక్తి లేచి కూర్చుంటాడు" అన్నాడు.

ఇంటర్‌నెట్‌లో చదవడం మంచిదే అయిందనుకుని, "రాముా మన దేశంలో 85 శాతం విషం లేని పాములే. కాటు వేసిన ప్రతిసారీ విషం ఎక్కాలని రూలేం లేదు. అలా విషం ఎక్కని కాట్లను 'డ్రై బైట్స్' అంటారు. పాము కరిచిందనే భయంతోనే చాలామంది చనిపోతున్నామనే భ్రమలో ఉంటారు. అలాంటివాళ్లు ఈ మంత్రగాళ్లు చేసే 'ట్రీట్‌మెంట్'తో భయం పోయి మామూలు మనుషులవుతారు. నిజంగా కరిచింది విష సర్పమై, ఆ విషం మనిషికి ఎక్కితే దానికి వెంటనే విరుగుడు మందు ఇవ్వాలి. లేకుంటే ఊపిరి పీల్చడం కష్టమై, కాసేపటికి మెదడుకు ఆక్సిజన్ అందక చనిపోతారు."

"నిజమే సార్. చిన్నప్పుడు మా స్నేహితుడికి పాము కరిస్తే, ఆ మంత్రగాడు మంత్రం వేసినా సీరియస్ అయింది. చివరికి, నేను చేయాల్సింది చేశాను. అతడికి ఆయుష్షు లేదని చెప్పాడు. డాక్టర్ దగ్గరకు తీసికెళుతుంటే దారిలోనే చనిపోయాడు".

"మరి ఈ విరుగుడు మందు అన్ని గవర్నమెంట్ హాస్పిటల్స్‌లో ఉంచొచ్చుగదా" అన్నాడు మోహన్.

"గవర్నమెంట్ చేయాల్సినవన్నీ చేస్తే మనలాంటివారికి పని ఉండదుగా.." అన్నాను.

మాటల్లోనే మళ్లీ నిద్రలోకి జారినట్లున్నాను.

"సార్.. వచ్చేశాం" అని డ్రైవర్ అనడంతో మేల్కొన్నాను. ఓ పెద్ద బిల్డింగ్ ముందు అంబులెన్స్ ఆగింది. రాము వచ్చి నా వైపు డోర్ తెరిచాడు. డ్రైవర్ నా కోటు అందించాడు. కోటు వేసుకుని, స్టెతస్కోపు మెడలో వేసుకుని గేటు దాటి లోపలికి వెళ్లాను. ఇంతలో రాము లోపలికి వెళ్లి రిసెప్షన్‌లో చెప్పినట్టున్నాడు.

"నమస్తే డాక్టర్, నా పేరు సుధ. డాక్టర్ గారు మీ కోసం ఎదురుచూస్తున్నారు" అంటూ ఎదురొచ్చింది.

> "డాక్టర్ రమేష్, మేము కాంక్రీట్ జంగిల్‌లో ఉన్నాం. ఇక్కడి పాములన్నీ ఎప్పుడో చనిపోయాయి. పాము విషం కంటే ప్రమాదకరమైన మనుషులు మాత్రం ఉన్నారు. అందుకని నాకు కూడా పాము కాటు ట్రీట్‌మెంట్ గురించి అంతగా తెలియదు. తెలుసుకోవాల్సిన అవసరం రాలేదు. కానీ ఆ మధ్య ఓ మెడికల్ కాన్ఫరెన్స్‌లో ఒక డాక్టర్ ప్రజెంటేషన్ విన్నాను. చాలా వర్క్ చేశాడు. మీ ఏరియానే .. చల్లపల్లి అని గుర్తు"

హాస్పిటల్ బిల్డింగ్ చుట్టూ అందమైన గార్డెన్ వారి అభిరుచులకు అద్దం పడుతోంది. లోపలికి వెళ్లాను. విశాలమైన వెయిటింగ్ హాల్లో వరసగా మెటల్ కుర్చీలు. చాలామంది రోగులు వెయిట్ చేస్తున్నారు. బయట చాలామంది దిగాలుగా ఉండడం గమనించాను.

ఓ పక్క కన్సల్టింగ్ రూమ్స్ ఉన్నాయి.

## ఈ వారం కథ

"డాక్టర్! మీరు ఫ్రెషప్ అవుతారా?" అడిగింది సుధ.

"లేదమ్మా. ముందు పాపను చూస్తాను" అన్నాను.

"సరే సర్. ముందు మీరు పాపను పరీక్షించండి. తరువాత డాక్టర్ గారు వచ్చి మాట్లాడతారు" అంది సుధ.

ఐసీయూ రూమ్‌లోకి తీసికెళ్లింది. లోపల ఒక పక్క బెడ్‌మీద ఎనిమిదేళ్ల పాప అచేతనంగా పడుకుని ఉంది. ఒక చేతికి సెలైన్ నడుస్తోంది. గొంతులో ఎండోట్రేఖియల్ ట్యూబ్ పక్కన ఓ చిన్న వెంటిలేటర్‌కి కలిపి ఉంది. వెంటిలేటర్ రిథమిక్‌గా నిమిషానికి 20 సార్లు ఊపిరి కొడుతోంది. పక్కనే హాస్పిటల్ యూనిఫామ్‌లో కాంపౌండర్ ఉన్నాడు. నన్ను చూడగానే,

"నమస్తే డాక్టర్. నా పేరు విజయ్. ప్రొద్దుట ఎనిమిదింటి నుంచి నేను డ్యూటీలో ఉన్నాను. పల్స్ ఆక్సిమీటర్‌లో రెగ్యులర్‌గా ఆక్సిజన్ శాతం గమనిస్తున్నాను. పావుగంటకోసారి రక్తపోటు రికార్డ్ చేస్తున్నాను. పవర్ పోతే జనరేటర్ ఆన్ అయ్యేలోపు ఊపిరి కొట్టడానికి యాంబ్యూబాగ్ రెడీగా ఉంచాను" అన్నాడు.

పాపను పరీక్షించడం మొదలెట్టాను. నాడి స్ట్రాంగ్‌గా కొట్టుకుంటోంది. ఊపిరితిత్తులు, గుండె బాగా పని చేస్తున్నాయి. కాళ్లూ చేతులూ అచేతనంగా ఉన్నాయి. కనుపాపలు రెండూ పూర్తిగా తెరుచుకుని ఉన్నాయి. టార్చ్‌లైట్ వేసి పరీక్షించినా కనుపాపల్లో కదలిక లేదు. నెమ్మదిగా బయటకు వచ్చి, రెస్ట్ రూమ్ ఎక్కడని సుధను అడిగాను. కొద్ది దూరంలోని ఒక రూమ్‌లోకి తీసికెళ్లింది.

పది నిమిషాల్లో డాక్టర్ రామకృష్ణ వచ్చారు.

"గుడ్ మార్నింగ్ డాక్టర్.. " నవ్వుతూ పరిచయం చేసుకున్నారు.

"నా పేరు రమేష్ సార్. విజయవాడ విక్టరీ హాస్పిటల్లో పీడియాట్రిషన్‌గా పని చేస్తున్నా" చెప్పాను. ఇంతలో సుధ రెండు కప్పులు, ఫ్లాస్క్ ఉన్న ట్రే తెచ్చి, టీపాయ్ మీద పెట్టింది. డ్రైవర్‌కి, కాంపౌండర్‌కీ కూడా కాఫీ ఇవ్వమన్నారు డాక్టర్ రామకృష్ణ.

కాఫీ కప్పులో పోస్తూ "డాక్టర్! మీ అసెస్‌మెంట్ ఏమిటి?" అని అడిగారు.

"సర్.. షీ ఈజ్ ఇన్ కోమా విత్ ఫ్లాసిడ్ పారలైసిస్, బ్రెయిన్ డెడ్ అని నేను అనుకుంటున్నాను" చెప్పాను.

"బ్రెయిన్ డెడ్ అవ్వాలంటే బ్రెయిన్‌కు రక్త ప్రసరణ కనీసం మూడు నుంచి ఐదు నిమిషాలు ఆగాలి. లేదా రక్తంలో ఆక్సిజన్ 85 శాతం కంటే తక్కువగా ఉండాలి. పాప హాస్పిటల్‌కు రాగానే చూశాను. ఇంజక్షన్ ఇవ్వవద్దని బతిమలాడింది. వెంటనే ఐవీ లైన్ పెట్టి బ్లడ్ టెస్ట్ చేశాం. కళ్లు మూతలు పడుతుండడం గమనించి వెంటనే 10 వయల్స్ యాంటి స్నేక్ వ్యాక్సిన్ ఇచ్చాను. పల్స్ ఆక్సీమీటర్‌తో ఆక్సిజన్ శాతం తగ్గడం గమనించి ఎండోట్రేఖియల్ ట్యూబ్ వేసి యాంబ్యూబ్యాగ్‌తో గాలి, ఆక్సిజన్ ఇచ్చాను.



తరువాత వెంటిలేటర్‌కి కనెక్ట్ చేశాను. ఎప్పుడూ హార్ట్ ఆగలేదు. ఆక్సిజన్ శాతం 95 కంటే ఎప్పుడూ తగ్గలేదు. అందుకని బ్రెయిన్ డెత్ అవడానికి అవకాశం లేదు. పాప కోలుకుంటుంది. ఆ విశ్వాసం నాకుంది. అయితే ఎంత సమయం పడుతుందన్నదే చెప్పలేను."

"సర్, నా ట్రైనింగ్‌లో మా ప్రొఫెసర్స్ చెప్పిందేమంటే కనుపాపలు వెలుతురుకు రియాక్ట్ అవకపోతే బ్రెయిన్ డెడ్ అని నిర్ధారించవచ్చని."

"నిజమే. మామూలుగా మనం భావించేది అదే. నేను కూడా ఎంబీబీఎస్ తరువాత ఆరు నెలలు అనస్థీషియా విభాగంలో, ఆరు నెలలు న్యూరాలజీ విభాగంలో పని చేశాను. కానీ ఈ కేసును ముందు నుంచీ ఫాలో అయ్యాను. ఆమె గుండె ఎప్పుడూ ఆగలేదు. 95 శాతం ఆక్సిజన్‌తో బాగా వెంటిలేట్ చేయబడే ఉంది. ఆమె మెదడు ఇంకా పని చేస్తోందని గట్టిగా చెప్పగలను."

ఇంతలో సుధ వచ్చి 'ఎమర్జెన్సీ' అని చెప్పగానే, డాక్టర్ రామకృష్ణ హడావుడిగా బయటకు వెళ్లారు. టీపాయ్ మీద న్యూస్‌పేపర్ చూస్తుండగా సెల్‌ఫోన్ మోగింది. డాక్టర్ వెంకట్ లైన్‌లో ఉన్నాడు.

"హలో వెంకట్. ఇప్పుడే చల్లపల్లి వచ్చాను. డాక్టర్ రామకృష్ణగారి హాస్పిటల్‌లో పాపను పరీక్ష చేశాను. ఆ డాక్టర్‌గారితో మాట్లాడుతున్నాను."

"మరి షిఫ్ట్ చేస్తున్నారా?"

"లేదురా. పాప బ్రెయిన్ డెడ్ అని నేననుకుంటున్నాను. ఆ డాక్టర్ గారేమో కచ్చితంగా పాప బతుకుతుందంటున్నారు".

"ఆ పల్లెటూరి డాక్టర్స్‌కి ఏం నాలెడ్జ్ ఉంటుందిరా. నువ్వు వచ్చేయ్. ఎంపీ గారితో నేను మాట్లాడతాలే" అని ఫోన్ పెట్టేశాడు.

నా మనస్సు చివుక్కుమంది. పల్లెటూరి డాక్టర్స్ అంటే ఈ సిటీ డాక్టర్స్‌కు ఎంత చిన్నచూపో అనిపించింది. ఇంతలో సుధ వచ్చి "డాక్టర్! మా డాక్టర్ గారు ఎమర్జెన్సీ కేసుతో బిజీగా ఉన్నారు. పాపని షిఫ్ట్ చేసే ఏర్పాట్లు చేయమంటారా?" అని అడిగింది.

"లేదమ్మా. మేం పాపని తీసికెళ్లడం లేదు"

> "సర్, ఈ కార్పొరేట్ హాస్పిటల్‌లో పని చేయడం నా మనసుకూ నచ్చడం లేదు. నేను కూడా పల్లెటూరిలో ప్రాక్టీస్ చేద్దామనుకుంటున్నాను. మీ ఏరియాలో అయితే ఎలా ఉంటుంది?"
> "బాగుంటుంది. మీలాంటి యువత పల్లెటూళ్లకి వచ్చి అధునాతన వైద్యాన్ని పేదలకు అందుబాటులోకి తెస్తే మాలాంటి వాళ్ల మద్దతు ఎప్పుడూ ఉంటుంది."

అని చెప్పాను.

"సరే సార్! మీ సెల్ నెంబర్ ఇవ్వమన్నారు. మీ ఫోన్‌లో వాట్సప్ ఉంది కదా."

ఉందని చెప్పి, సెల్ నెంబర్ ఇచ్చాను. పాప బంధువులతో విజయవాడ షిఫ్ట్ చేయడం కుదరదని చెప్పి బయటకు వచ్చాను.

• • •

నా పనిలో బిజీగా రెండు రోజులు గడిచాయి. మూడో రోజు ఉదయం సెల్ ఫోన్‌లో మెసేజెస్ చెక్ చేస్తుండగా, తెలియని నంబర్ నుంచి వాట్సప్ మెసేజ్ ఉంది. ఓపెన్‌చేశాను.

చల్లపల్లి హాస్పిటల్లో ఐసీయూ బెడ్ మీద పాప లేచి కూర్చుని ఉంది. పక్కన డాక్టర్ రామకృష్ణ "నీ పేరేమిటమ్మా?" అని అడిగారు.

"పద్మ" అని స్పష్టంగా చెప్పింది.

నా కళ్లను నేను నమ్మలేక పోయాను.

"మీది ఏ ఊరు?"

"వక్కలగడ్డ".

"మీ నాన్నగారు ఎక్కడున్నారు?" డాక్టర్ అడిగిన వెంటనే తలతిప్పి కుడివైపున ఉన్న తండ్రిని చూపించింది. ఆయన ముఖం సంతోషంతో వెలిగిపోతోంది. పక్కన ఆయన భార్య చేతులెత్తి డాక్టర్ గారికి నమస్కారం చేస్తోంది. ఎడమ పక్కన ఉన్న నర్సులను, కాంపౌండర్‌ను చూపించి 'వీళ్లెవరు?' అని అడిగారు.

"నాకు తెలియదు" అంది.

వాళ్లంతా నవ్వుకుంటున్నారు. వాళ్ల ఆనందం వర్ణనాతీతం. తాము పడ్డ శ్రమకు ప్రతిఫలం దక్కిందని చాలా సంతోషంగా ఉన్నారు.

వెంటనే ఆ నంబర్‌కు ఫోన్ చేశాను. రిసెప్షనిస్టు సుధ పలికింది.

"డాక్టర్, వాట్సప్ మెసేజ్‌చూశారా?"

"చూశానమ్మా. అందుకే డాక్టర్ గారికి కంగ్రాట్స్ చెబుదామని కాల్ చేశాను."

"సర్, డాక్టర్ గారితో మీకు ఫోన్ చేయిస్తాను" అంది.

ఐదు నిమిషాల తరువాత ఫోన్ మోగింది.

"సర్! నేను డాక్టర్ రమేష్‌ను మాట్లాడుతున్నా. అభినందనలు. నా ఆలోచన తప్పని నిరూపించారు. చాలా సంతోషంగా ఉంది. ఓడిపోయినా ఇంత ఆనందంగా ఉండడం ఇదే నాకు మొదటిసారి."

"అంటే మీరు సరిగ్గానే ఆలోచిస్తున్నారు రమేష్. మీరు మీ గురించి కంటే మీ పేషెంట్స్ బాగోగులకే అధిక ప్రాధాన్యమిస్తారని అర్థమవుతోంది."

"సర్! మీరు అద్భుతం చేశారు."

"అదేం లేదు రమేష్. ఈ విజయం సైన్స్‌దే. ఈ గొప్పతనం మొదట పద్మ తండ్రికి దక్కుతుంది. చిన్న పిల్ల నిద్రలో ఏదో కుట్టిందని చెప్పగానే, ఆ మాటను సీరియస్‌గా తీసుకుని, ఎవ్వరినీ సంప్రదించకుండా నేరుగా హాస్పిటల్‌కు తీసుకురావడం వల్లే సరైన వైద్యం అందించగలిగాం. అదే ఓ పదినిమిషాలు సమయం వృథా అయినా మనం చేయగలిగేదేమీ ఉండేదికాదు. మిగిలిన గొప్పతనం విషానికి విరుగుడు కనిపెట్టిన శాస్త్రవేత్తలకు, దాన్ని ఎన్నో కష్టాలకోర్చి తయారు చేస్తున్న శ్రామికులకు చెందుతుంది."

"సర్! మీ వ్యక్తిత్వం చాలా గొప్పది. నేనే మీ ప్లేస్‌లో ఉంటే కాలర్ ఎగరేసి, గాల్లో తేలిపోయేవాడిని" అన్నాను.

"రమేష్, డాక్టర్స్‌గా రోగిని బాగు చేయడానికి మన ప్రయత్నం మనం చేస్తాం. కానీ ఎక్కువ సార్లు మంత్రగాళ్ల వద్దకు తీసికెళ్లి సమయం వృథా చేస్తారు. అందుకనే ఈ చుట్టుపక్కల గ్రామాల్లో అందరికీ అవగాహన కల్పించేందుకు కృషి చేస్తున్నాం".

"సర్, ఈ కార్పొరేట్ హాస్పిటల్‌లో పని చేయడం నా మనసుకూ నచ్చడం లేదు. నేను కూడా పల్లెటూరిలో ప్రాక్టీస్ చేద్దామనుకుంటున్నాను. మీ ఏరియాలో అయితే ఎలా ఉంటుంది?"

"బాగుంటుంది. మీలాంటి యువత పల్లెటూళ్లకి వచ్చి అధునాతన వైద్యాన్ని పేదలకు అందుబాటులోకి తెస్తే మాలాంటి వాళ్ల మద్దతు ఎప్పుడూ ఉంటుంది. నిర్ణయం తీసుకునే ముందు మీ భార్యతో చర్చించండి".

"అలాగే సార్ .. ఇప్పుడే మా శారదతో మాట్లాడతాను" మరోసారి ధన్యవాదాలు చెప్పి సంతోషంగా ఫోన్ కట్ చేశాను.

sudhakarsurap@gmail.com

# పంజాబీ రుచులు భల్లే... భల్లే!



## చనా మసాలా

**కావలసిన పదార్థాలు**

కాబూలీ శనగలు- ఒక కప్పు, ఎండుకొబ్బరి తురుము- అర కప్పు, దాల్చిన చెక్క- అంగుళం ముక్క, సోపు- అర టేబుల్ స్పూను, జీలకర్ర- అర టీ స్పూను, ధనియాలు- ఒక టేబుల్ స్పూను, ఎండుమిర్చి- 3, లవంగాలు- 3, యాలకులు- 2, మిరియాలు- 5, నూనె- 3 టేబుల్ స్పూన్లు, బిర్యానీ ఆకు- 1, ఆవాలు- అర టీ స్పూను, కరివేపాకు- ఒక రెమ్మ, పచ్చిమిర్చి- 2, కొత్తిమీర- కొద్దిగా, ఉల్లిపాయ- 1, టమోటాలు- రెండు, పసుపు- అర టీ స్పూను, అల్లంవెల్లుల్లి ముద్ద- ఒక టీ స్పూను, ఉప్పు- రుచికి తగినంత.

**తయారీ విధానం**

ఎనిమిది గంటలు నానబెట్టిన శనగలలో అర టీ స్పూన్ ఉప్పు వేసి, మూడు విజిల్స్ వచ్చేదాకా కుక్కర్‌లో ఉడికించాలి. ఒక గిన్నెలో దాల్చిన చెక్క, సోపు, జీలకర్ర, ధనియాలు, ఎండుమిర్చి, లవంగాలు, మిరియాలు, యాలకులను వేసి చిన్నమంట మీద వేగించాలి. తర్వాత ఎండుకొబ్బరి తురుము కూడా వేసి కొద్దిసేపు వేగించి, మిక్సీలో పొడి చేసుకోవాలి. మెత్తని పొడి అయ్యాక కొన్ని నీళ్లు పోసి మళ్లీ ఒక తిప్పు తిప్పాలి. ఒక బాణలిలో నూనె పోసి వేడెక్కాక ఆవాలు, జీలకర్ర, ఉల్లిపాయ ముక్కలు వేసి వేగించాలి. అల్లంవెల్లుల్లి ముద్ద, పసుపు, కరివేపాకు వేసి మరో 5 నిమిషాలు వేగించాలి. తర్వాత టమోటా ముక్కలు, ఎండుకొబ్బరి మసాలా వేసి బాగా కలపాలి. తర్వాత శనగలు, ఉప్పు వేసి ఒక కప్పు నీళ్లు పోసి ఉడికించాలి. చివరగా కొత్తిమీర, పచ్చిమిర్చి వేసి దింపేయాలి.



## ఫిర్నీ

**కావలసిన పదార్థాలు**

బాస్మతి బియ్యం- 2 టేబుల్ స్పూన్లు, పాలు- 3 కప్పులు, చక్కెర- 5 టేబుల్ స్పూన్లు, యాలకుల పొడి- అర టీ స్పూను, బాదం పొడి- ఒక టేబుల్ స్పూను, జీడిపప్పు, బాదం- అలంకరణకు.

**తయారీ విధానం**

బాస్మతి బియ్యాన్ని గంటసేపు నానబెట్టి, ఒక కప్పు పాలు పోసి మెత్తగా రుబ్బుకోవాలి. మిగిలిన పాలను గిన్నెలో పోసి వేడి చేసి, మరుగుతున్నప్పుడు బాస్మతి మిశ్రమం వేసి ఉడికించాలి. చక్కెర, యాలకుల పొడి కూడా వేసి, గరిటెతో కలుపుతూ గట్టిపడేదాకా ఉడికించాలి. పైన బాదం, జీడిపప్పులతో అలంకరించాలి.



**ఫుడ్ కోర్ట్**

## పంజాబీ కడీ పకోరా

**కావలసిన పదార్థాలు**

పెరుగు- ఒకటిన్నర కప్పులు, కారం, పసుపు, గరం మసాలా- ఒక్కోటీ స్పూను చొప్పున, శనగపిండి- ఒక కప్పు, నూనె- వేగించడానికి సరిపడా, ఉల్లిపాయలు- 2 (నిలువుగా కోసుకోవాలి), వాము- అర టీ స్పూను, అల్లంవెల్లుల్లి ముద్ద- ఒక టేబుల్ స్పూను, మెంతులు- పావు టీ స్పూను, పచ్చిమిర్చి- 2, ఎండుమిర్చి- 3, జీలకర్ర- ఒక టీ స్పూను, కరివేపాకు- ఒక రెమ్మ, ఉల్లికాడలు- అర కట్ట, ఉప్పు- తగినంత.

**తయారీ విధానం**

ఒక గిన్నెలో పెరుగు, సగం శనగపిండి, అర టీ స్పూన్ చొప్పున కారం, పసుపు, గరం మసాలా వేసి, కొద్దిగా ఉప్పు వేసి బాగా కలిపి పక్కన పెట్టుకోవాలి. మిగిలిన సగం శనగపిండిలో జీలకర్ర, మిగిలిన కారం, గరం మసాలా వేసి కొద్దిగా ఉప్పు వేసి బజ్జీల పిండిలా కలుపుకోవాలి. సగం ఉల్లిపాయ ముక్కలు కూడా వేసి బాగా కలిపి పకోడీలు వేసుకోవాలి. తర్వాత ఒక బాణలిలో నూనె పోసి వేడెక్కాక వాము, మెంతులు, ఇంగువ వేసి వేగించాలి. తర్వాత మిగిలిన ఉల్లిపాయ ముక్కలు వేసి 3 నిమిషాలు వేగించి అల్లంవెల్లుల్లి ముద్ద, ఎండుమిర్చి, కరివేపాకు, ఎండుమిర్చి వేయాలి. వీటిని చిన్న మంట మీద 2 నిమిషాలు వేగించి, పెరుగు మిశ్రమం వేసి బాగా కలిపి పావుగంట సేపు ఉడికించాలి. ఆ తర్వాత ఉల్లిపాయ పకోడీలను వేయాలి. 10 నిమిషాలు ఉడికించిన తర్వాత గరం మసాలా వేసి చిన్నమంట మీద 2 నిమిషాలు ఉడికించి దించేయాలి.



## కుల్చ

**కావలసిన పదార్థాలు**

మైదా- రెండున్నర కప్పులు, పెరుగు- 4 టేబుల్ స్పూన్లు, బేకింగ్ పౌడర్- అర టీ స్పూను, తినే సోడా- పావు టీ స్పూను, చక్కెర- 2 టీ స్పూన్లు, నూనె లేదా నెయ్యి- రెండున్నర టేబుల్ స్పూన్లు, నల్ల నువ్వులు- కొన్ని, ఉప్పు- తగినంత.

**తయారీ విధానం**

మైదాలో చక్కెర, ఉప్పు, బేకింగ్ పౌడర్, తినే సోడా వేసి బాగా కలపాలి. ఇందులో పెరుగు, నూనె, తగినన్ని నీళ్లు పోసి చపాతీల పిండిలా కలుపుకోవాలి. దీనిపైన తడి బట్ట వేసి 2 గంటలు నాననివ్వాలి. తర్వాత చిన్నచిన్నముద్దలు చేసుకుని, వాటిపైన నల్లనువ్వులు వేసి చపాతీల్లా ఒత్తుకోవాలి. రెండు వైపులా కాల్చిన తర్వాత నూనె లేదా నెయ్యి రాయాలి.






| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| car | | h | o | m | e | a | b |
| lip | | m | y | p | p | r | q |
| worm | | r | o | i | a | s | y |
| yoyo | | o | y | l | n | s | u |
| home | | w | o | t | d | u | i |
| panda | | c | a | r | a | e | f |

దారి కనుక్కోండి






రంగులు వేయండి




విలువ ఎంత?

+ = 10

- = 8

× = ?

## పిసినారి గాడిద!

అనగనగా కరిపురం అనే ఊళ్లో ఓ రజకుడు ఉండేవాడు. అతను చాలా పిసినారి. బట్టలు మోసేందుకు అతనికి ఒక గాడిద అవసరం పడింది. అయితే గాడిద తిండికి అయ్యే ఖర్చును భరించడం అతనికేమాత్రం ఇష్టం లేదు. ఆ ఖర్చును తప్పించుకునేందుకు ఓ ఉపాయం ఆలోచించాడు. మరసటిరోజు సంతకి వెళ్లి ఓ గాడిదను కొన్నాడు. దాంతో పాటు ఒక పులి తోలును కూడా కొనుక్కొని, ఎవరికీ తెలియకుండా ఇంటికి తీసుకువచ్చాడు. పగలంతా గాడిదకు ఏమీ పెట్ట కుండా, దాంతో పని చేయించుకునేవాడు. రాత్రి పూట పులితోలుని ఆ గాడిదపైన కప్పి, ఒక రైతు పొలంలోకి వదిలేవాడు. పచ్చగా పెరిగిన పైరును గాడిద కడుపారా తినేది. ఉదయాన్నే ఆ గాడిదకు కప్పిన పులి తోలుని తీసి భద్రపరిచేవాడు. ఈ విధంగా కొంత కాలం గడిచింది. ఆ రైతుకు ఒక పులి వచ్చి, తన పంటను తింటున్నట్టు తెలిసింది. కష్టపడి పండించిన పంటను తినేస్తోందని పులిపైన కోపం వచ్చింది. ఎలాగైనా దాన్ని చంపాలనుకున్నాడు.

ఒకరాత్రి బూడిదరంగు దుప్పటి కప్పుకుని, వేటాడేందుకు విల్లంబులు తీసుకుని చెట్టు చాటున దాక్కున్నాడు. పులితోలు కప్పుకున్న గాడిద వచ్చి, పంటను తినడం మొదలుపెట్టింది. రైతు విల్లు ఎక్కుబెట్టాడు. కానీ బాణం వేయడానికి ధైర్యం చాల్లేదు. అంతలో ఆ గాడిద, బూడిద రంగు దుప్పటి కప్పుకున్న రైతును చూసి, పైరు తినడానికి మరో గాడిద వచ్చిందని అనుకుంది. ఇన్నాళ్లకు తనకు తోడుగా మరో గార్ధభం వచ్చిందనే సంతోషంతో ఓండ్ర పెట్టింది. అది విన్న రైతు, ఇన్నాళ్లూ తానో గాడిదను చూసి పులి అనుకుని భయపడ్డానని తెలుసుకున్నాడు. "పులితోలు కప్పుకుని, నన్నెంత మోసం చేసిందీ" అనుకుంటూ, కోపంతో బాణం వేసాడు. తృటిలో తప్పించుకున్న ఆ గాడిద, భయంతో అరుస్తూ అక్కడి నుంచి దూరంగా పారిపోయింది. రజకుడు ఎంత వెతికినా గాడిద దొరకలేదు. దురాశకు పోయి కష్టపడి పనిచేసే గాడిదను కోల్పోయానని లబోదిబోమన్నాడు.



## చుక్కలు కలపండి



## గిన్నిస్ కొట్టిన బుల్లి డీజే






'ఇట్ సుకీ మోరిటా' (Its-u-ki Morita )- ఈ పేరు చెబితే ఎవరూ గుర్తుపట్టకపోవచ్చు కానీ 'డీజే మోరిటా' అంటే మాత్రం జపాన్‌లోని అందరికీ సుపరిచితమే. పబ్బులకూ, క్లబ్బులకూ వెళ్లే యూత్‌లో అయితే ఈ చిన్నోడికి ప్రత్యేకమైన ఫాలోయింగ్ ఉంది. సరిగా పదాలు పలకడం కూడా రాని వయసులో, డీజేగా పనిచేస్తూ, చిన్నా, పెద్ద తేడా లేకుండా అందరి అభిరుచికీ తగ్గట్టుగా, అద్భుతమైన పాటలను, అదిరిపోయే రాక్ మ్యూజిక్‌తో మిక్స్ చేస్తూ, శ్రోతలను ఉర్రూతలు ఊగిస్తున్నాడు. జపాన్‌లోని 'ఎల్ బార్ అండ్ రెస్టారెంట్'లో డీజేయింగ్ చేస్తున్న ఈ ఆరేళ్ల వయసున్న (6 సంవత్సరాల 114 రోజులు) ఈ బుడ్డోడిని 'ప్రపంచంలోనే అతిచిన్న వయసున్న క్లబ్ డీజే'గా గుర్తించింది గిన్నిస్‌బుక్. ప్రస్తుతం ఎలిమెంటరీ స్కూల్ చదువుతున్న మోరిటా, డ్రమ్స్ కూడా బాగా వాయించగలడు.

## అంకెల తమాషా-1

142857- ఈ సంఖ్య చాలా ప్రత్యేకమైనది. దీన్ని 2 తో గుణిస్తే, ఈ సంఖ్యలోని అంకెలే స్థానాలు మారి వస్తాయి. అలాగే 3 తో, 4 తో, 5 తో, 6 తో గుణించినా సరే, అవే అంకెలు స్థానాలు మారుతూ వస్తాయి. అంతేకాని మరో కొత్త అంకె రాదు. అయితే 7 తో గుణించినప్పుడు మాత్రం ఈ అంకెలేవీ రాకుండా అన్నీ తొమ్మిదులే వస్తాయి. భలే తమాషాగా ఉంది కదూ. కావాలంటే మీరూ ట్రై చేసి చూడండి.

142857 X 2 = 285714
142857 X 3 = 428571
142857 X 4 = 571428
142857 X 5 = 714285
142857 X 6 = 857142
142857 X 7 = 999999



## మంచి పద్యం



**ఎప్పుడు సంపద కలిగిన**
**అప్పుడె బంధువులు వత్తురది యెట్లన్నన్**
**దెప్పలుగ జెరువునిండిన**
**గప్పలు పదివేలు చేరు గదరా సుమతీ!**

**భావం:**
చెరువు నిండా నీరు చేరగానే కుప్పలు, తెప్పలుగా కప్పలు వచ్చి చేరినట్టు సంపద ఉన్నవారి ఇంటికే బంధువులు వస్తారు. ఆ సంపదలు కరిగిపోయాక, అటువైపు తొంగికూడా చూడరు.

## తేడాలు కనుక్కోండి



## మీకు తెలుసా..

- 'మ్యాథమేటిక్స్' అనే ఆంగ్లపదం 'మ్యాథెమా' అనే గ్రీకు పదం నుంచి వచ్చింది. ఆ పదానికి నేర్చుకోవడం, విద్య, శాస్త్రం అని అర్థాలున్నాయి.
- 'వేల్' చేపల గుండె బరువు, ఒక మారుతీ కారు బరువు కంటే ఎక్కువ.

**జవాబులు**

**విలువ ఎంత?:** 72
**తేడాలు కనుక్కోండి:** చెట్టు మీద పండ్లు, గాలి మర మధ్యలో రంగు, పక్కన స్తంభం, తెల్ల గుర్రం మీద మచ్చలు.



# అనుగ్రహం

6 - 12 ఆగస్టు 2017

డాక్టర్ పి.ఎ. రామన్



### మేషం

**అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం**

శుభకార్యానికి యత్నాలు సాగిస్తారు. అవకాశాలను తక్షణం అందిపుచ్చుకోండి. ఖర్చులు విపరీతం. ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు. దంపతుల మధ్య సఖ్యత లోపం. శ్రమాధిక్యతతో పనులు పూర్తి చేస్తారు. ఒక సమాచారం ఆలోచింపచేస్తుంది. అయినవారితో సంప్రదింపులు జరుపుతారు. ఎదుటివారి అభిప్రాయాలకు విలువ ఇవ్వండి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం.



### వృషభం

**కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

ఆర్థికస్థితి నిరాశాజనకం. ఆలోచనలు నిలకడగా ఉండవు. ఆప్తుల సాయం అందుతుంది. ఆది, సోమ వారాల్లో అనేక పనులతో సతమతమవుతారు. జీవిత భాగస్వామి సలహా పాటించండి. పంతాలు, భేషజాలకు పోవద్దు. పిల్లల విషయంలో శుభపరిణామాలు సంభవం. బ్యాంకు వివరాలు వెల్లడించవద్దు. నమ్మకస్తులే మోసగించే ఆస్కారం ఉంది.



### మిథునం

**మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

మీ మాటతీరు ఆకట్టుకుంటుంది. కొన్ని పనులు ఆకస్మికంగా పూర్తవుతాయి. పరిచయాలు ఉన్నతికి సహకరిస్తాయి. పదవులు, బాధ్యతల స్వీకరణకు అనుకూలం. స్వల్ప అస్వస్థతకు గురవుతారు. విశ్రాంతి అవసరం. మంగళ, బుధ వారాల్లో ఒక వ్యవహారంలో మీ జోక్యం అనివార్యం. అయిన వారితో విభేదిస్తారు. విలువైన వస్తువులు, డబ్బు జాగ్రత్త.



### కర్కాటకం

**పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

ఆత్మీయులతో సంప్రదింపులు జరుపుతారు. మీ అభిప్రాయాలకు స్పందన లభిస్తుంది. వివాదాలు కొలిక్కి వస్తాయి. ధనలాభం, వస్త్రప్రాప్తి, వాహన యోగం ఉన్నాయి. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. ఆది, గురు వారాల్లో నగదు స్వీకరణలో జాగ్రత్త. వ్యవహారాలు మీ చేతుల మీదుగా సాగుతాయి. పెట్టుబడుల విషయంలో పునరాలోచన అవసరం.



### సింహం

**మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

ఆదాయ వ్యయాలు సంతృప్తికరం. కొత్త విషయాలు తెలుసుకుంటారు. పనుల ప్రారంభంలో ఆటంకాలెదురవుతాయి. మీపై శకునాల ప్రభావం అధికం. ఆత్మీయుల గురించి ఆందోళన చెందుతారు. జీవిత భాగస్వామి వైఖరిలో మార్పు వస్తుంది. వ్యవహారాలు స్వయంగా చూసుకోవాలి. మంగళ, శనివారాల్లో ఎవరి సహాయం ఆశించవద్దు. దళారుల పట్ల అప్రమత్తంగా ఉండాలి.



### కన్య

**ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

ఇంతకాలం పడిన కష్టం ఫలిస్తుంది. పొదుపు చేసిన ధనం అందుతుంది. మానసికంగా కుదుటపడతారు. పరిచయాలు బలపడతాయి. ఖర్చులు విపరీతం. పనులు మొండిగా పూర్తి చేస్తారు. అనవసర విషయాల్లో జోక్యం తగదు. గురు, శుక్ర వారాల్లో పరిచయస్తుల రాకతో ఇబ్బంది. వ్యవహారాలు స్వయంగా చూసుకోవాలి. జీవిత భాగస్వామి సలహా పాటించండి.



### తుల

**చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

ముందుచూపుతో తీసుకున్న నిర్ణయం సత్ఫలితాన్నిస్తుంది. పదవులు, బాధ్యతలు స్వీకరిస్తారు. పలుకుబడి పెరుగుతుంది. వ్యతిరేకులు సన్నిహితులవుతారు. శుభకార్యం నిశ్చయమవుతుంది. ఖర్చులు అంచనాలను మించుతాయి. స్తోమతకు మించి హామీలివ్వవద్దు. ఏకపక్ష నిర్ణయం తగదు. విలువైన వస్తువులు జాగ్రత్త. పందాలు, జూదాల జోలికి పోవద్దు.



### వృశ్చికం

**విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

శుభకార్యంలో ప్రముఖంగా వ్యవహరిస్తారు. మీ మాటతీరు ఆకట్టుకుంటుంది. ఆకస్మికంగా కొన్ని పనులు పూర్తవుతాయి. ధనలాభం, వస్త్రప్రాప్తి, వాహన యోగం పొందుతారు. పెద్ద ఖర్చు తగిలే ఆస్కారం ఉంది. కొన్ని కార్యక్రమాలు వాయిదా వేసుకుంటారు. పిల్లల ఉన్నత చదువుల పట్ల శ్రద్ధ అవసరం. మీ అభిప్రాయాలను లౌక్యంగా వ్యక్తం చేయండి.



### ధనుస్సు

**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

శ్రమ ఫలిస్తుంది. ఆర్థిక ఇబ్బందులు తొలగుతాయి. సకాలంలో చెల్లింపులు జరుపుతారు. పనులు నిదానంగా పూర్తవుతాయి. విమర్శించిన వారే మీ ఔన్నత్యాన్ని గుర్తిస్తారు. అవకాశాలను తక్షణం వినియోగించుకోండి. సలహాలు, సాయం ఆశించవద్దు. జీవిత భాగస్వామి వైఖరిలో మార్పు వస్తుంది. ఇతరుల బాధ్యతలు చేపట్టవద్దు. ఒప్పందాలకు అనుకూలం.



### మకరం

**ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు**

రాబోయే ఆదాయానికి తగ్గట్టు ఖర్చులుంటాయి. పొదుపు చేయాలన్న ఆలోచన ఫలించదు. ఒక ఆహ్వానం ఆలోచింపచేస్తుంది. కొత్త పరిచయాలేర్పడతాయి. వ్యవహారాలు స్వయంగా చూసుకోవాలి. కార్యసాధనకు అవిశ్రాంతంగా శ్రమిస్తారు. ఆది, సోమ వారాల్లో పనులు మందకొడిగా సాగుతాయి. పిల్లల అత్యుత్సాహం ఇబ్బంది కలిగిస్తుంది. ఆరోగ్యం సంతృప్తికరం.



### కుంభం

**ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

ఆశావహదృక్పథంతో యత్నాలు సాగించండి. తొందరపడి నిర్ణయాలు తీసుకోవద్దు. పెద్దల సలహా తీసుకోండి. ఖర్చులు ప్రయోజనకరం. అవసరాలు తీరుతాయి. రావలసిన డబ్బుని లౌక్యంగా వసూలు చేసుకోవాలి. ఆధిపత్యం ప్రదర్శించవద్దు. పట్టుదలతో శ్రమిస్తే కానీ పనులు పూర్తి కావు. మంగళ, బుధ వారాల్లో అనవసర విషయాల్లో జోక్యం తగదు.



### మీనం

**పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

అతికష్టంమ్మీద యత్నాలు ఫలిస్తాయి. ఆందోళన తొలగి కుదుటపడతారు. ఒక వ్యవహారంలో డబ్బు అందుతుంది. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. వాయిదా పడిన పనులు పూర్తి చేస్తారు. విలువైన వస్తువులు, పత్రాలు జాగ్రత్త. బాధ్యతలు స్వయంగా చూసుకోవాలి. గురు, శుక్ర వారాల్లో తప్పటడుగు వేసే ఆస్కారం ఉంది. సన్నిహితుల సలహా తీసుకోండి.

# జన్మకుండలి


రమేశ్చంద్ర మహర్షి

సెల్ : 92 46 58 22 55

040-65 22 55 54

rameschandramaharishi.com




భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచ భూతాలూ, అహంకారం, బుద్ధి, ప్రకృతి, పంచ జ్ఞానేంద్రియాలు, మనసూ అనే పదకొండు ఇంద్రియాలూ, శబ్ద, రూప, స్పర్శ, రసగంధాలనే ఇంద్రియ విషయాలూ కోరిక, ద్వేషం, తెలివి, సుఖం, దుఃఖం, ధైర్యం... వీటి వికారాలూ కలిసి ఏర్పడే క్షేత్రం... మనిషి! ఆ మనిషికి భవిష్యత్తనే దారి చూపే నేత్రం, జ్యోతిశ్శాస్త్రం!!

★ ★ ★

ఎన్ని శతాబ్దాలు గడిచినా మనిషి ఒక కొలిక్కి రాలేని విషయం..

Life is more by accident than design... నిజమా

లేక life is more by design than accident నిజమా ... అన్నది.

గోడ మీద నుండి పతనం కావడం భవిష్యత్తు అని నిర్ధారించబడి ఉంటే "పడడం" accident! "దూకడం" design! భవిష్యత్ ముందే తెలిస్తే పడడాన్ని దూకడంగా మలచు కోవచ్చు.

కృతే కార్యే కిం ముహూర్త ప్రశ్నేన? పని ముగిసిన పిదప ముహూర్తమడగడం, జరగకూడనిది జరిగిపోయాక పరిహారాలు పాటించడం వలన ఏమిటి ప్రయోజనం?

భవిష్యత్ ముందే తెలిస్తే ముప్పు నుండి తప్పించుకోవడం లేదా తగ్గించుకోవడం సాధ్యమే!

కాలః క్రీడతి గచ్ఛత్యాయుః

కాలం ఆడుకుంటూ ఉంటుంది. ఆయువు గతించిపోతూ ఉంటుంది. రాబోయే మంచి చెడులు తెలిస్తే ఉన్నంతలోనే ఉన్నతంగా జీవించగలుగుతాం!

వయం భగవంతః స్యామ!

| | | | |
|---|---|---|---|
| | | రా | (శ) |
| చం | రాశి | | (గు) |
| | | | |
| బు | కే ర | కు శు | |

❖ ఈ జన్మకుండలి ప్రకారం

1) ఈమె ఉన్నత కుటుంబంలో జన్మించడం జరుగుతుంది.

2) గ్రహణం రోజుల్లో జన్మించడం వలన "ఇక్కడ" ఈమె తండ్రికి దాన గుణం ఎక్కువై రుణ బాధల్లో ఇరుక్కోకుండా చూసుకోవలసిన పరిస్థితి.

3) తల్లి ఎంతో విద్యావంతురాలయి కూడా, నోటిని అదుపులో పెట్టుకోలేని ఒక మహా గయ్యాళి! తల్లికి ఆయుష్షు ఎప్పటికప్పుడు పెంచుకుంటూ... అంటే పరిహారాలు పాటించుకుంటూ వెళ్ళాలి. ఆ పరిహారాల్లో ఒకటి స్లిపాఫ్ టంగ్ కాకుండా జాగ్రత్త పడడం. ఇంకా వివరంగా చెప్పుకుంటే... ఈమె వాక్కూ, ఆయుష్షూ రెండూ డైరెక్టిలీ ప్రపోర్షనల్!

4) ఈమె ఇంటికి పెద్ద సంతానం. ఈమె తర్వాత ఒక తోబుట్టువు.

5) ఇక యోగాలకు వెళ్తే, హంస మహాయోగం 50 శాతం ఉన్నప్పటికీ, అది ఇంకా ఎంత తక్కువ పని చేస్తే అంత మంచిది. ఈ జన్మకుండలి వరకూ హంస మహాయోగం, శకట యోగం రెండూ కలిసి భర్తలో విరుద్ధ ఆవేశాలకు కారణమవడం... అంటే మంచివాడో తెలియదు, చెడ్డవాడో తెలియదు. అలాగే అతడు ఉచ్ఛ స్థితి నుండి రావడం జరుగుతుంది. కానీ అది జీవితాంతం నిలబెట్టుకోవాలి. ఉత్థాన పతనాలు, అన్ని కోణాల్లోనూ, అతని జీవితంలో ఒక భాగం కాకుండా చూసుకోవాలి.

అందానికి మాత్రం నలకూబరుడు. కళ్లు నేరేడు. మనిషి నెలరేడు.

6) మాలవ్యా మహా యోగం పనిచేస్తుంది. అయితే అది కుజ రవి కేతువుల వలన 60 శాతం మాత్రమే. అయినా కూడా గొప్ప వాహన యోగం, గృహ యోగం, వృత్తిలో సృజనాత్మకత, బాస్ ర్యాంక్!

7) విద్య మెడిసిన్, ఇంజినీరింగ్ రెండూ సమానంగా కనబడుతున్నప్పటికీ చివరలో తులసాకు పడి తూచేది మాత్రం ఇంజినీరింగ్‌నే!

8) ఈమె 17 నుండి 36 వయసు మధ్య శని దశ. ఉద్యోగ పరంగా అతిశయించి యోగించే దశ ఇది.

శనిలో శుక్రుడి నుండి ఉద్యోగ ఘడియలు... అంటే 23 నుండి. ప్రారంభమే ఘనంగా ఉంటుంది. 26, 30, 40, 45, 54 వయసులో వృత్తి పరంగా చాలా ఆశ్చర్యకరంగా అద్భుతమైన స్థితికి చేరుకోవడం జరుగుతుంది. రవి కేతువులకు ఎంత పరిహారాలు పాటిస్తే ఈ జన్మకుండలి వరకూ అంత ఉపయోగం.

ఏది ఏమయినా అనితర సాధ్యమయిన ప్రతిభ, గొప్ప సృజనాత్మకత, ఇతరులు అసూయ పడే శేముషి, పూర్ణ ప్రజ్ఞ... అందుకేనేమో తన రంగంలో తనకు శత్రువులు ఎక్కువే! ఏ రాజయోగమయితే అంతటి స్థితినిస్తుందో, దానిలో గ్రహయుద్ధం, ఎక్లిప్స్ పాయింట్ ఇంబైబ్ అయి ఉండడం దీనికి కారణం.

ఈర్ష్యా కలహ మూలం!

9) ఇక వివాహం జరిగేది శనిలో, శుక్రునిలో, చంద్రునిలో అంటే 24 వ ఏట... రవి గురుల కర్కాటక సంచారంలో. అయితే ఇది గ్రహణం రోజులు కావడం వలన కొన్ని పరిహారాలు పాటించ వలసి ఉంటుంది. వివాహం ప్రేమ వివాహం. కారకుడినీ, అధిపతినీ ఈ ప్రేమ తత్త్వం, ప్రేమ భావం, ప్రేమ భావ చాలనం కదిపి కుదిపేయడం వలన ... It's a case of heart ruling the head అనిపించుకోవడం జరుగుతుంది. ఎవరు ఎవరినయినా కూడా ఎంత తక్కువ ప్రేమిస్తే అంత మనశ్శాంతి అన్న విషయం ఈ జాతకురాలికి బోధ పరచడం అవసరం!

ఏది ఏమయినా వివాహంతో "కలిసొస్తుంది."

10) శనిలో చంద్ర భుక్తిలో... అంటే 28 వయసులో కలిగే సంతానంతో ధనయోగం పడుతుంది. షేర్స్, స్పెక్యులేషన్‌లో విపరీత ధనలాభం ఉంటుంది.

11) ఈస్ట్ ఫేసింగ్ ఇంట్లో అన్నీ కలిసొస్తాయి. సౌత్ ఫేసింగ్ అయితే ధనం, సంతానం ఈ రెండు విషయాలూ తృప్తినిస్తాయి. వెస్ట్ ఫేసింగ్ అయితే భర్తకు ధనయోగం. తనకు మాత్రం కెరీర్‌లో అనవసర శత్రుత్వం. నార్త్ ఫేసింగ్ ఇంట్లో అయితే భర్తతో ఘర్షణ. రహస్య స్నేహాలు చేయాలన్న ఆలోచనలు. అయితే ఆయుర్దాయానికి మంచిది.

12) కుజాంతర్దశలో, శనికి కుజుడు కంట్రోలింగ్ ఫేక్టర్ కూడా కావడం వలన గృహయోగం. అయితే అది తన పేరు మీద ఉండదు. ఇది జరిగేది తన 30 వయసులో.

13) ఆరోగ్య పరంగా... ఇట్టే పొట్ట వచ్చే తత్వం కాబట్టి ఆ కోణంలో జాగ్రత్త పడాలి. రక్తానికి సంబంధించి ఓవర్ బ్లీడింగ్ సమస్య వేధించకుండా చూసుకోవాలి.

14) శక్తి యుక్తులు : జ్ఞాత్వాపి దోషమేవ కరోతి లోకః!

మేధస్సుకు లోటు లేదు. అయితే అన్నీ తెలిసి కూడా తప్పులు చేయడం ఇక్కడ విశేషం. దీనికి మూలకందం మనసు అతిగా స్పందించడం. ప్రేమిస్తే తప్ప ఏ పనీ చేయలేక పోవడం. ప్రేమ అనేది అవసరం పునాది మీద పుడుతుందని ఎంత చెప్పినా అర్థం కాదు. ఈ గుండెకాయ 'పండి' పోయే వరకూ ప్రేమిస్తూనే ఉంటాను అనడం, అనుకోవడం తప్పు కాదు. అయితే అటు నుండి భర్తవయిపు అంత స్పందన లేక పోవడం ఇక్కడ అసంతృప్తికి కారణం! వృథా వృష్టిః సముద్రేషు!

అతడిని ఎంత ఇష్టపడినా అది సముద్రంలో కురిసిన వర్షమే!!

కొత్త పుస్తకాలు

## కథాగానానికి సరికొత్త స్వరం

ఆధునిక తెలుగు కథా సాహిత్యాన్ని కొత్త దృక్పథంతో పుంతలు తొక్కిస్తున్న బలమైన కలం వేంపల్లె షరీఫ్. కథా వస్తువు ఎంపికతో పాటు కథనరీతుల్ని సులువుగా చెప్పగల సామర్థ్యం పుష్కలంగా ఉండడం షరీఫ్‌కు తెలిసిన విద్య.

అందుకే ఈ పదకొండు కథల్లో ఎక్కడా సంక్లిష్టతలుండవు. అర్థంకాని వాదప్రతివాదాలుండవు. భావజాలాల గొడవలు కాని, భావగర్భితమైన అన్వయాలుకాని కనిపించవు. కథల్లో సింహభాగం ఒక వర్గం జీవనవైవిధ్యాన్ని లోతుగా తాదాత్మ్యంతో, సానుభూతిగా, అనుభూతితో ఆస్వాదించి రాసినవే. సమాజ మూలాల్ని తటస్థ వైఖరితో గమనించాడు కనకనే 'అమ్మబొమ్మ'లో అమ్మకు మతాల రంగుపూయడం సుతరామూ తగదని సుతిమెత్తగా సున్నిత హృదయాలకు అర్థమయ్యేలా చెబుతారు రచయిత. 'దారితప్పిన కల' పైకి ముస్లిం స్త్రీల ఆత్మగౌరవానికి సంబంధించిన అంశంగా కనిపించినా 'జీవితాంతం క్రీస్తు శిలవ మోసినట్టు నీళ్లు మోస్తూ ఉండాల్సిందే' అంటూ రాయలసీమ తరతరాల క'న్నీటి' వ్యథని గుర్తుకుతెస్తుంది. అంతేకాదు మతాంతర వివాహం చేసుకున్న కూతురుకు నీళ్లు తేవాల్సిన రోజువారీ కష్టం నుంచి కనీసం ఉపశమనం పొందడానికైనా అల్లుడు గోషా పెడతాడా? అని కన్నతల్లి పడ్డ మూగవేదన మాతృమూర్తి హృదయాన్ని ఆవిష్కరిస్తుంది.

'టోపీ జబ్బార్' కథలో తెలిసీ తెలియని ప్రేమమథనం కనిపిస్తున్నా .. సమాజంలో ఎదురయ్యే వివక్ష, అవమానాలు, అస్థిత్వానికి కాపాడుకునేందుకు జబ్బార్ పడిన అవస్థలు అంతర్లీనంగా మన గుండెల్లో గునపాలు దించుతునే ఉంటాయి. కులవృత్తుల దోపిడీ, అన్యాయాలను ధైర్యంగా ఎదుర్కోవడం ఎలాగో చెబుతుంది 'తలుగు' కథ. పిల్లల్ని శిక్షించే లేదా శిక్షించడానికి సిద్ధపడ్డ తల్లిదండ్రులకు కనువిప్పు కావాలంటే 'ఒంటిచెయ్యి' చదివి తీరాల్సిందే.

మీడియా ప్రహసనాన్ని వ్యాఖ్యానించే 'వింతశిశువు', వర్తమాన రాజకీయ పరిస్థితులకు దర్పణం పట్టే 'దహనం' ... ఇలా ఒక్కో కథా ఒక్కో ఆలోచనా తీరంలో మనల్ని కట్టి పడేస్తాయి. జీవన దృశ్యాల ఆత్మీయ స్వరం వినాలంటే 'టోపీ జబ్బార్' కథలు చదవితీరాల్సిందే!

**- బొబ్బిలి శ్రీధరరావు**



**టోపీ జబ్బార్ కథలు**
వేంపల్లె షరీఫ్
**పేజీలు :** 142, **వెల:** రూ. 125
**ప్రతులకు :** 96034 29366,
ప్రముఖ పుస్తక కేంద్రాలు

## రష్యన్ విప్లవ చరిత్ర

వర్తమానంలో ఏదైనా సాధించాలంటే గతంలో ఏం జరిగిందో తెలుసుకోవాలి. కట్టుకథలు, అర్థ సత్యాలతో నిండిన అకడమిక్ పుస్తకాల నుంచి సమగ్రమైన, సరైన చరిత్రను ఆశించలేం. ఆ లోటును తీరుస్తుంది విరసం ప్రచురించిన బోల్షివిక్ పార్టీ చరిత్ర. 1953లో తొలిసారి ప్రచురించిన ఈ చరిత్రను రష్యన్ విప్లవానికి వందేళ్ల సందర్భంగా పునర్ముద్రించారు. సాధారణంగా ఇలాంటి చరిత్రలో వివరణకే ఎక్కువ ప్రాధాన్యత ఉంటుంది. అంతేగాక, ఎంతో కొంత ఒంటెద్దు పోకడతో సాగుతాయి. ఇలాంటి పోకడలకు విరుద్ధంగా విప్లవోద్యమ పంథాలోని ఎగుడుదిగుడలను కూడా అక్షరబద్ధం చేశారు. వివిధ దశల్లో సాగిన రష్యన్ విప్లవం తీరుతెన్నులను పన్నెండు అధ్యాయాల్లో సువివరంగా విశదీకరించారు. ప్రపంచం వ్యాప్తంగా ఉన్న శ్రామిక జనావళిలో ఎన్నో ఆశలు రేకెత్తించి, ఎన్నో నూతన మార్పులకు దోహదం చేసిన రష్యన్ విప్లవం గురించి తెలుసుకోవాలనుకున్న వారంతా తప్పక చదవవాల్సిన పుస్తకం ఇది.

**- దేరా**




**బోల్షివిక్ పార్టీ చరిత్ర**
**పేజీలు:** 519, **వెల :** రూ.250
**ప్రతులకు :** 9989189250
ప్రముఖ పుస్తక కేంద్రాలు

## సమకాలీన కథనాలు

**1960**-70 దశకాల్లోని నాటి మధ్య తరగతి స్త్రీల, సంసారాల, బాధల, గాధల ఘటనలు ప్రధాన ఇతివృత్తమైన కథలు దౌలత్ బేగం కథలు. ఆనాటి సామాజిక మనస్తత్వాన్ని నేటి తరం పాఠకులకు చక్కగా, సూటిగా పరిచయం చేస్తాయి. మధ్య తరగతి జీవితాల్లోని విషాదం అంతిమంగా ఆత్మహత్యలకూ, యాదృచ్ఛిక చావులకు ఎలా దారితీస్తుందో ఈ సంపుటిలోని చాలా కథలు ఎటువంటి కల్పనలూ, ముసుగులూ లేకుండా సహజంగా వివరిస్తాయి. పదాడంబరం లేకుండా స్త్రీల జీవితాల్లోని అన్ని కోణాలూ స్పృశిస్తాయి. సంఘటనలనూ, అనుభవాలను కథలుగా మార్చి చెప్పే క్రమంలో రచయిత్రి వేగం, ప్రజ్ఞ ఆ కాలం నాటికే కాదు నేటికీ ఆశ్చర్యపరిచేలా ఉండడం ఈ సంపుటి ప్రత్యేకత.

**- లెనిన్ ధనిశెట్టి**




**దౌలత్‌బేగం కథలు**
**పేజీలు :** 165, **వెల :** రూ.100
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

## కాశీ చూపించిన కంఠుగాడు

సగం ట్రావెలాగ్, సగం కథ కలిసిన సమగ్ర కథనం 'కంఠుగాడి కాశీయాత్ర'. జగన్నాథ శర్మ చేసిన ఈ రచన నవ్య వీక్లీలో ధారావాహికగా వెలువడింది కూడా. కంఠు అనే వ్యక్తి తన స్నేహితులతో చేసిన కాశీయాత్రను వివరించే ఈ రచన కాశీ ప్రాదేశిక ఆధ్యాత్మికతను పిట్టకథల రూపంలో చెప్పడమే కాదు, కాశీయాత్ర గురించి అక్కడి పరిసర ప్రాంతాల గురించీ ఒక ప్రాథమిక అవగాహనను ఏర్పరుస్తుంది. హిందువులకు అత్యంత ప్రీతిపాత్రమైన కాశీనగరాన్ని దర్శించి, గంగా నదిలో మునిగి తీరాలనే మొక్కును తీర్చుకొనే క్రమంలో కంఠు అతని మిత్ర బృందం అనుభవించిన సంఘర్షణలూ, పొందిన అనుభూతులనూ నాటకీయత మేళవించి వివరిస్తాడు రచయిత. అదే సమయంలో సమకాలీన కాశీ, దాని పరిసర పర్యాటక ప్రాంతాలలో యాత్రికులు దోపిడీ అయ్యే విధానాలనూ, పద్ధతులనూ వినోదాన్నీ వ్యంగ్యాన్నీ మిళితం చేసి అర్థం చేయిస్తుందీ రచన. ఒక క్రమ పద్ధతిలో విషయాన్ని వివరించి ఉంటే ఇది మరింత మంచి రచన అయి ఉండేది. కథనం చివరలో కాశీయాత్రా చిత్రమాల ఈ పుస్తకానికో అదనపు ఆకర్షణ.

**- డి. లెనిన్**



**కంఠుగాడి కాశీయాత్ర**
ఎ.ఎస్. జగన్నాథశర్మ
**పేజీలు :** 80, **వెల :** రూ.100
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

